మహాతాత్త్వికుడు

# జిడ్డు కృష్ణమూర్తి అవగాహన





రచన :

జె. శ్రీ రఘుపతిరావు



జయంతి పబ్లికేషన్స్
కారల్ మార్క్స్ రోడ్డు * విజయవాడ-520 002

MAHATATWIKUDU

JIDDU KRISHNAMURTY AVAGAHANA

By

J. S. RAGHUPATHI RAO, B.E., F.I E.

JAYANTI PUBLICATIONS
Vijayawada - 520 002

Edition:
JANUARY 1992

PRICE :
Rs. 15-00

Printers:
ANILA PRITERS
Vijayawada - 2

# ఒక మనవి

కేవలం మనిషిగా మహోన్నతి చెందిన వాడు శ్రీ జిడ్డు కృష్ణమూర్తి. ఒక కుసుమంలా వికసించాడు. దైవం పేరుతోనో, అతీత శక్తుల ముసుగులోనో పెరిగి పేరుగాంచినవాడు కాదు. ఇటీవల అలా విజ్ఞానంగా మానవులకు అతి సన్నిహితుడైనవాడు అతడే.

మానవ జీవితానికి సంబంధించిన విషయాలనే ఎక్కువగా ప్రస్తావించాడు. ప్రతి విషయం పరిశీలించాడు. పరీక్షకు నిలబడినదాన్నే స్వీకరించాడు. జీవిత తత్వాన్ని లోతుగా చూశాడు, చూపించాడు. అవగాహన జేసికోమన్నాడు. అదే ఆచరణ, జీవితం అన్నాడు.

ప్రపంచ మానవుని సంక్షేమానికి తహతహలాడాడు.

కృష్ణజీని అర్థం చేసికోవడానికి కొందరు మిత్రులం ప్రతి మాసంలో ఒక ఆదివారం కలుస్తున్నాం. ఒక్కొక్కసారి ఒక్కొక్క విషయం రోజంతా చర్చిస్తున్నాం. అలా 1988 ఫిబ్రవరి 17 (కృష్ణజీ రెండవ వర్ధంతి) నుండి సాగుతుంది శ్రీకాళహస్తిలో. అదే జిడ్డు కృష్ణమూర్తి స్టడీ సెంటర్.

సమావేశంలో చివరిగా ఆ విషయంలో కృష్ణజీ చెప్పింది వినిపించడం జరుగుతున్నది.

తొలి మాటలు నేను వ్రాసి, తెలుగు సేత జోడించి అనేక ప్రధాన విషయాలపై విషయ సంగ్రహణ చేశాను.

ఈ పుస్తకములో ఒక ఆరు విషయాలు చేర్చి "అవగాహన" రూపంలో సమర్పిస్తున్నాను.

ఈ అవకాశాన్ని ఆసక్తి పరులైన ఆంధ్ర పాఠకులు సద్వినియోగం చేసికొనగలందులకు మనవి చేయుచున్నాను.

గూడూరు
10-5-1990

ఇట్లు,
జె. శ్రీ రఘుపతిరావు

# నిత్యసత్యాన్వేషి తాత్త్విక విప్లవకారుడు
# జిడ్డు కృష్ణమూర్తి

అరే! నీవింకా ఇక్కడే వున్నావా? అని ఆశ్చర్యపోతూ! లోలోన బాధపడ్డారు, క్లాసు బయటికి వచ్చిన మాష్టారు. మందగోడిగా వున్నాడని ఒక విద్యార్థిని బాగా కొట్టి వరండాలో నిలబెట్టారు ఆ మాస్టారు. క్లాసు అయ్యేదాకా అతని ధ్యాసే లేదు ఆయనకు. అతడు అలాగే నిలబడి తదేక దృష్టితో ప్రకృతిని చూస్తున్నాడు. ఇంతలో గంట కొట్టారేమో, నిత్యానంద వచ్చి "అన్నయ్యా! రా" అంటూ వెంటబెట్టుకెళ్ళాడు.

అలా పరధ్యానంగా నిమగ్నుడైన బాలుడే మహోన్నత భావ, గుణ, లక్షణ, లక్షితుడైన పరిపూర్ణ మానవతామూర్తి, శ్రీ జిడ్డు కృష్ణమూర్తి. నిశిత పరిశీలన, సూక్ష్మావగాహనల సమ్మేళనమే అతని జీవితం. సంపూర్ణ స్వేచ్ఛ అతని వికాసానికి ఊపిరి. సమస్త మానసిక, భౌతిక నిబద్ధతకు లోనుగాకుండడమే ఆ స్వేచ్ఛకు జీవం. అతనిలో మేధాసంపత్తి, విశాల హృదయం సమపాళ్ళలో వృద్ధిచెందాయి. అందుచే సామాన్య వ్యక్తిగా జన్మించి విశ్వ మానవుడుగా జీవించాడు.

జిడ్డు కృష్ణమూర్తి 1895 మే నెల 12న మదనపల్లిలో స్వగృహములో పూజా మందిరంలో పుట్టాడు. అష్టమ గర్భ సంజాతుడగుటచే కృష్ణమూర్తి యని పేరు పెట్టారు. అతని తలిదండ్రులు సంజీవమ్మ, నారాయణయ్యలు. తల్లి చిన్నతనములోనే పోయింది. తండ్రి రెవెన్యూ ఉద్యోగిగా రిటైరు అయి, బిడ్డలతో సహా అడయారు వెళ్ళి దివ్య జ్ఞాన సమాజంలో పనిచేస్తున్నాడు.

సమాజంలో ప్రముఖ సభ్యుడైన బిషప్ లెడ్ బీటరు అడయారు ఇసుక తిన్నెలపై ఆడుకొంటూవున్న కృష్ణమూర్తి ముఖవర్చస్సు చూసి ఆకర్షితుడైనాడు. పరమగురువు మైత్రేయ ప్రభువు అగోచరంగా వుండి ప్రపంచాన్ని రక్షిస్తున్నారని సమాజ సభ్యుల నమ్మిక. మైత్రేయ ప్రభువు ప్రవేశించటానికి అతని దేహం అనువైనదని లెడ్ బీటరు భావించాడు. అధ్యక్షురాలైన అనిబెసెంట్ సహకారంతో కృష్ణకు నిత్యకు సమాజంలోనే భోజన నివాస సదుపాయాలు కల్పించాడు. వారికి శిక్షణనిస్తూ ప్రైవేటుగా విద్య నేర్పించాడు. అనిబెసెంట్ ఆ ఇద్దర్ని దత్తత తీసికొని ప్రత్యేక పరిస్థితులల్లో విద్యార్జనకై ఇంగ్లాండు పంపింది. అక్కడి సమాజ సభ్యురాలైన లేడి యెమిలి కృష్ణకు అత్యంత అభిమానురాలైంది. కృష్ణుని, యశోద లాలించి, పోషించినట్లు ఆదరించింది. అట్లే అనేకులు అభిమానించారు. ఎందరో అతని శిక్షణ విశ్రాంతి యాత్రాశిబిరాలకు హాజరయ్యేవారు. వారికితడు ధర్మబోధకూడ చేస్తుండేవాడు.

నిత్యానంద చదువులో చురుగ్గా వుంటూ మెట్రిక్ పాసయి లా చదువుతున్నాడు. కృష్ణ మాత్రం మెట్రిక్ ముమ్మారు తప్పాడు. ఆ మీదట అనిబెసెంట్ సలహాపై పారిస్ వెళ్ళి ఫ్రెంచ్ భాష నేర్చుకొన్నాడు. ఇంతలో నిత్యానందకు క్షయ వ్యాధి సోకింది.

లెడ్ బీటర్ ఆస్ట్రేలియాలోని సిడ్నీ పట్నంలో వుంటూ సమాజ వార్షికోత్స వాలకు అన్నదమ్ముల్ని పిలిపించాడు. అక్కడినుండి "నిత్య" ఆరోగ్యం నిమిత్తం ఇద్దరు కాలిఫోర్నియాలోని ఓహై లోయకు వెళ్ళారు. నిత్య చికిత్స పొందుతున్నాడు. కృష్ణ ధ్యానాదులు చేస్తూ ఉండేవాడు. అతనికి ఒక విధమైన అనుభూతులు 1923లో మొదలైనాయి. వెన్నెముక, మెడ, తలలలో తీవ్రమైన నొప్పి కలిగేది. కలవరించ డం, సేవ చేసే వారిని తాకవద్దని నెట్టివేయడం, "అమ్మా" అని అరవడం చేసేవాడు. ఆ వేదనతో రెండురోజులు గడిచాయి. అతని వద్ద నిత్య, నిత్యకు సేవ చేస్తున్న అమెరికన్ యువతి రోజలిండ్ ఉన్నారు.

మూడో రోజు ఆగస్టు 17న ఆ వేదన ఎక్కువైంది. ఎరురుగా ఉన్న పెద్ద పెప్పర్ వృక్షంక్రింద కూర్చున్నాడు కృష్ణ. అపస్మారక స్థితిలో కొంతసేపు వుండి, తెలివిరాగానే వణకుతూ, ఏదో సణుగుతూ ఓపిక తెచ్చుకొని ఆరాధన శ్లోకాలు ఉచ్చరించాడు. తక్షణం మౌనం వహించాడు. బహిర్గతంగా ఆవేదనలూ, అంతర్గ తంగా అనుభూతులు చెందాడు. మెల్లగా లేచివస్తుంటే రోజలిండ్ "అడుగో బుద్ధుడు! బుద్ధుడు!" అని అరుస్తూ కుర్చీలో కూలబడింది.

ఆ రోజు కృష్ణమూర్తి పరివర్తనకు నాంది ప్రస్తావన అయింది. అతని అంతశ్చేతనం వికసించింది. ఇక అలాంటి అనుభవాలు అనేకం కలుగుతూ వచ్చాయి. పగలనక, రాత్రనక పరిణామ ప్రక్రియ కొనసాగింది.

ఒకసారి కృష్ణమూర్తి మిత్ర బృందంతో ఆస్ట్రియాలోని యెర్వాల్ట్‌కు వెళ్ళాడు. రెండు నెలలపాటు పరివేదనానుభూతికి గురి అయ్యాడు. ఒకరోజు అది పరాకాష్ట పొందింది. అతడు స్పృహ కోల్పోయాడు.

అప్పటి నుండి కృష్ణమూర్తిలో నిశ్చలత, గాంభీర్యం, తేజస్సు, దీక్ష, విశాలత, స్వేచ్ఛ, శక్తి కొట్టవచ్చినట్టు పెరిగాయి. అనుయాయులు, అభిమానులు, మిత్రులు అతణ్ణి "కృష్ణజీ" అని పిలవసాగారు. ఓహైలో తాముంటున్న భవనాలు కొనుగోలు చేసి "సోదరుల ట్రస్టు"కు దాఖలు పరచి దానికి "ఆర్య విహార్" అని పేరు పెట్టారు.

ఇంతలో అడయార్‌లో స్వర్ణోత్సవ మహాసదస్సుకు హాజరుకమ్మని అనిబె సెంట్ వర్తమానం పంపింది. నిత్యానందకు ప్రాణాపాయముండదని పరమ గురు

వులు హామీ ఇచ్చారని మాట ఇచ్చింది. కాని కృష్ణ మార్గమధ్యంలో ఉండగానే ఓహైలో నిత్య మరణించినట్లు తంతి వచ్చింది. కృష్ణ ఖిన్నుడై పోయాడు. దాంతో గురువులపై విశ్వాసం చెదిరింది. దుఃఖం కట్టలు తెంచుకొంది. ఎలాగో దిగ మింగి, పిడికిలి బిగించి, జీవితాన్నెదుర్కొవడానికి సిద్ధపడ్డాడు. నిత్య తనలో కలిసి పోయి నట్టుగా, తాను ద్విగుణీకృత శక్తిమంతుడైనట్టుగా ప్రకటించాడు.

అడయారు చేరి స్వర్ణోత్సవ సభలో (1925 లో) అధునాతన భావాల్తో ప్రసంగించాడు. అప్పటి వరకున్న ఆధ్యాత్మిక విధానాలకు మార్పు నాశించాడు. ప్రపంచ బోధకుడు ఉదయించాడని అనిబెసెంట్ ప్రకటించింది. అంతేకాక తాను కృష్ణజీకి భక్తితత్పరతతో కూడిన శిష్యురాలనని వెల్లడించింది. అయితే జార్జి అరండేలు వంటి వారు అతణ్ణి విశ్వసించలేదు.

అనిబెసెంట్, లెడ్ బీటర్లు ఆశించిన రీతిగా కృష్ణజీ విశ్వగురువు కాలేదు. సమస్త విశ్వాసాలకూ, సర్వవిధానాలనూ, సకల సంస్థలను ప్రశ్నించాడు. వాటివల్ల సత్యదర్శనం కలగదని నొక్కి చెప్పాడు అంతేకాక 18 సంవత్సరాలు తనను పెద్దచేసి, తన అధ్యక్షతలో తనకై ప్రచారం చేసిన "ఆర్డర్ ఆఫ్ ది స్టార్ ఇన్ ది ఈస్ట్" సంస్థను అనిబెసెంట్ సమక్షంలోనే రద్దుచేసి, దానికి సంబంధించిన కోటాను కోట్ల విలువగల ఆస్తులను దాతలకు తిరిగి యిచ్చివేశాడు. దివ్యజ్ఞాన సమాజాన్నే వదిలాడు. అన్ని బంధనాలనుండి, సంస్థలనుండి, విశ్వాసాలనుండి, నిబద్ధతలనుండి వైదొలిగాడు. సంపూర్ణ స్వేచ్ఛతో సర్వస్వతంత్రుడైనాడు.

## కృష్ణజీ ప్రబోధాల సారం

"సత్యానికి మార్గమంటూ లేదు. ఏ మార్గం ద్వారా గాని, ఏ మతం ద్వారా గాని, ఏ శాఖ ద్వారా గాని సత్యాన్ని పొందలేరు. సత్యం హద్దులకు నిబద్ధతలకు లోను కానిది. కనుక దాన్ని సంస్థాగతం చేయరాదు. చేస్తే శవసదృశం అవుతుంది. ఒక ప్రత్యేక సంస్థనుబట్టి పొమ్మని ఏ ఒక్క సంఘమూ ప్రజల్ని వత్తిడిచేయరాదు.

దేవునిలోని నమ్మకమే మతం అనుకొంటాము. నమ్మకపోతే సంఘం నాస్తికుడని తిట్టి పోస్తుంది. నమ్మితే ఒక సంఘం తిరస్కరిస్తుంది. నమ్మక పోతే మరొక సంఘం తిరస్కరిస్తుంది, ఏ మత విశ్వాసమైనా మనుష్యుల్ని విభజిస్తుంది. విశ్వాసం కేవలం వ్యక్తిగతమైనది.

"జ్ఞానం" అంటే ఏమంటారంటే, తెలిసిందే జ్ఞానం. అది బ్రెయిన్ సెల్స్

ద్వారా సేకరింపబడుతుంది. జ్ఞాపకంగా మిగుల్తుంది. జ్ఞాపకాల పుట్టే జ్ఞానం. గతమే జ్ఞానం. సాంకేతిక జ్ఞానం ఒక స్థాయిలో అవసరం. అది భౌతిక జీవనానికి ఆధారం. మానసికంగా జ్ఞానం నిబద్ధిస్తుంది. స్వేచ్ఛ నివ్వదు. అది కొనసాగేది, కనుక దానికి పరిపూర్ణత లేదు. అంచేత జ్ఞానం సృజనాత్మకమైన అంశం కాదు. జ్ఞానంతో ఉబ్బి పోయిన పండితులలో, నేనెక్కువ అంటే నేనెక్కువ అనే అహంకారం అవరిస్తుంది. విషయ సేకరణ కంటే అవగాహన ముఖ్యం. నిన్ను నీవు అర్థం చేసికోకుండా పెద్దల వత్తిడికి లోబడితే మనస్సును అణిచివేస్తావు. దాంతో భయం వచ్చి పడుతుంది. భయం వున్నచోట ప్రేమ ఉండదు. ప్రేమలేని జ్ఞానం మనల్ని నాశనం చేస్తుంది. ప్రస్తుతం అదే జరుగుతోంది.

ధ్యానం గురించి ఏమి చెప్పారంటే, ధ్యానం అంటే మనసును డొల్ల చేయడం. అప్పుడు నూతనసత్వం జనిస్తుంది. అన్ని ఆలోచనలనుండి, శబ్దాల నుండి మనసుకు స్వేచ్ఛ నివ్వడమే ధ్యానం. ధ్యానంలో ఏకాగ్రత అనేది స్వార్థపరంగా మొలకెత్తిన అంశం. అలా కాకుండా అన్ని శక్తులను శ్రద్ధగా, సావధానంగా సమీకరించడమే ధ్యానం. ఇది చాలా అవసరమైంది. దానివల్ల ప్రేమ సుమం వికసిస్తుంది.

ఈ విధంగా అనేక జీవిత వాస్తవాలు వెల్లడిచేస్తూ మానవత్వానికి బాసటగా నిలచి 70 ఏళ్ళు నిరాఘాటంగా ప్రపంచాన్ని చుట్టి, బహుజనానికి బోధన చేశాడు. 90 సంవత్సరాల 9 మాసాలకు పైగా జీవించాడు.

మొదటినుండి చివరిదాక స్వేచ్ఛ, విద్య-జీవిత ప్రాధాన్యత, అసాధ్యమైన ప్రశ్న, కృష్ణమూర్తి నోటుబుక్, కృష్ణమూర్తి జర్నల్, జీవన వ్యాఖ్యానములు, హింస కావల, జీవన పరిపూర్ణత, ప్రజ్ఞా మేల్కొల్పు, మున్నగు కృష్ణమూర్తి రచనలు, ప్రవచన గ్రంథాలు పాతిక పైగా వెలువడ్డాయి. ఆయన విప్లవాత్మక భావాల ననుసరించి ఇండియా, ఇంగ్లండ్, అమెరికాలలో ఏడెనిమిది సరికొత్త పాఠశాలలు వెలిశాయి. వాటిని కృష్ణమూర్తి ఫౌండేషన్ నిర్వహిస్తున్నది.

1986 జనవరి 4న మద్రాసులో 'మరణము-ధ్యానము' గూర్చి ప్రసంగిస్తూ అదే చివరి అభిభాషణమని చెప్పాడు. తరువాత ఉత్సాహంగా జనవరి 10న బయలు దేరి కాలిఫోర్నియా వెళ్ళాడు. కాలేయంలో క్యాన్సరు గడ్డకు కొంత చికిత్స పొంది, ఓహై కాటేజిలో ఉండి పోయాడు.

"ఇది నా అంతిమ దర్శనం, నన్నొక దైవాంశ సంభూతుని చేయకండి. నా కెవరూ భక్తులు లేరు. నాకు స్మారక మందిరాలు, దేవాలయాలు వద్దు. నా

భౌతిక దేహాన్ని పరిశుభ్రపరచి అగ్నికి అర్పించండి. ప్రార్థనలు, ఆరాధనలు, ప్రసంగాలు, ప్రజా దర్శనాలు వద్దు" అని చివరిగా చెప్పారు.

అది ఫిబ్రవరి 16 ఆదివారం. పరివర్తనకు నాంది పలికిన తేది. చైతన్య వృక్షమైన "పెప్పర్ ట్రీ" క్రింద పద్మాసనాసీనుడై ధ్యాన నిమగ్నుడై నాడు. అర్ధరాత్రి దాటాక నిద్రలోకి జారుకొని నిశ్చల, నిరీహా, నిర్మల, నిరంజన, తురీయ స్థితి పొందాడు. అతని కట్టె విద్యుద్దహన సాధనకు ఆహుతి అయి పోయింది.

అతడు కనుమరుగైనా ప్రవచనాల ద్వారా లోకావగాహనలో వెలుగై ఉన్నాడు. ఆ వెలుగులో మనలను మనం తెలిసికొందాము గాక !

భారతీయులు కన్న బిడ్డ
ఆంగ్లేయుల ముద్దు బిడ్డ
అమెరికనుల గారాబు బిడ్డ
ప్రపంచపు దొడ్డ బిడ్డ !

జీవన దర్శన స్ఫూర్తి
వసుధైక కుటుంబ దీప్తి
తాత్విక యుగ చక్రవర్తి
అతడే జిడ్డు కృష్ణమూర్తి !

.... ....

పరివర్తనము వ్యక్తి హృదయమున ప్రారంభము కావలయును.

.... ....

గాయపడకుండుట కౌశలము. అది అన్ని గాయములను హరించును.

.... ....

దైవంగాని, సత్యంగాని, యదార్థంగాని ఏ పేరైనా అసలు ఉన్నదా లేదా అను ప్రశ్నకు సమాధానం పుస్తకాలుగాని-మతప్రచారకులుగాని, తత్త్వవేత్తలుగాని, జగద్రక్షకులుగాని చెప్పలేరు. నీవు తప్ప ఎవరూ బదులు చెప్పలేడు.

.... ం ....

# ఇందులో....

# దేశకాలాలు (SPACE, TIME)

## దేశం-కాలం

దేశమంటే ఇక్కడ భూమి కాదు, కాలమంటే గడియారపు కాలంకాదు. దేశమంటే ఖాళీ, ఆకాశం, స్పేస్ (Space) నిరామయంగా ఉండడం. కాలమంటే మానసికమైనది. కల్పన చేసికొన్నది. ఊహాత్మకమైంది. అంటే కాలెండరులోలాగ మనసులో కూడ విభజన చేసికొన్నది.

## అవకాశం

ఖాళీగా ఉన్నచోట ఏదైన ప్రవేశించడానికి అవకాశం ఉంటుంది. అందుకే దేశాన్ని అవకాశం అని కూడ అనవచ్చు. నిండి ఉన్నచోట వేరైంది జొరబడలేదు.

## ఖాళీ

గదిలో వస్తుజాలం చిందరవందరగా వుంటే ఎంతో చికాకు. క్రమ పద్ధతిలో వుంటే వాడుకోడానికి వీలవుతుంది. నిలవచేసి వుంచితే చెడిపోవచ్చు, దుర్వాసన కొట్టవచ్చు, అచేతనం కావచ్చు, గది ఖాళీగా వుంటే పరిశుభ్రంగా వుంచవచ్చు, ఎప్పటికప్పుడు ఏపనైనా చేసికోవచ్చు, ఏ వస్తువైనా పెట్టవచ్చు. పాతది తీసేస్తే, కొత్తది ఉంచుకోడానికి వీలవుతుంది. హృదయం కూడా అలా వుండాలి. అపుడు అక్కడ దేశమున్నట్లు భావించవచ్చు.

హృద్దేశమన్నారు. హృదయంలో దేశముంది. అందులోకి ఏదైనా వస్తూ,పోతూ ఉండాలి గాని, బంధింప బడరాదు. అది ఖాళీగా వుంటేనే వెలుగు ప్రకాశించేది. నిజంగా జీవించగలిగేది, ఎప్పటికప్పుడు నూతనంగా, చైతన్యంగా ఉండగలిగేది. కనుక ఖాళీయే చలనాత్మక శూన్యత కావచ్చు.

## కాలం - మార్పు

కాలాన్ని భౌతిక అవసరాల కొద్దీ నిర్ణయించుకున్నాం, అదీ అవసరమే. ఒక పథకానికి, కార్యనిర్వహణకు, కృషికి, అభివృద్ధికి అది విధానం. భౌతిక సాధనకు కాలం అవసరం. అనుకున్నదానికి, సాధించిన దానికి మధ్య వుండేదే కాలం. కాలమే సాధన. ఇది సూర్యోదయ, సూర్యాస్తమయాలకు సంబంధించింది. అలాగే కాలాన్ని మానసికమైన మార్పునకు కూడ అవసరమనుకుంటాము. మార్పుకు సాధన కావాలని, సాధనకు వ్యవధి కావాలని అంటాం. అలా మార్పుకు

వాయిదావేస్తాం. అయినా "ఉన్నస్థితి" లోనే వుంటాం. ఇది ఎంతవరకు సముచితం? అసలు మానసికంగా కాలమంటూ ఉందా?

## భయ కారణం

ఆలోచనలో కాలముంటుంది. ఆలోచనలతో గతం నుంచి, భవిష్యత్తులోకి వెళ్లినపుడు అయోమయంగా వుంటుంది. వర్తమానాన్ని వదిలితే అస్థిరత్వమే: ఇలాంటి స్థితే భయానికి మూలం. నిన్నటిలాగ, నేటిలాగ రేపు ఉండాలనే ఆలోచనలో ఆశ, భయం దాగి ఉన్నాయి, కాబట్టి మానసికంగా కాలగణన లేకుండా, వర్తమానం లోనే జీవిస్తే భయానికి తావులేదు.

## రేపు లేదు

మానసికంగా రేపులేదు. హింసాపరుడు కొంతకాలానికి అహింసాపరుడు కావడంగాని, అజ్ఞాని కొంత కాలానికి విజ్ఞాని కావడం అనే కాలమానం, మానసికంగా లేదు. ఇది కాలం ద్వారా జరిగే ప్రక్రియ కాదు. వెయ్యేళ్ళు వేచియున్నా, అజ్ఞానం జ్ఞానంగా మారదు. తెలుసుకున్న వెంటనే అదృశ్యమౌతుంది. నిజంగా మార్పు అవసరమైతే తక్షణమే జరుగుతుంది.

## నేడులో జీవించాలి

కాలంలో ఉన్నంత వరకు కాలాతీతతత్త్వంగూర్చి ఎంత మాట్లాడినా ఆది కాలంలోనిదే అయి ఉంటుంది. నేటిలో జీవిస్తూ, రేపటిని ఊహిస్తే, అది నేటిదే అవుతుంది. పైగా నేడు కూడ సరిగ్గా దక్కదు. కాబట్టి ఊహల్లో జీవించడం మాని వాస్తవంలో జీవించడం నేర్చుకోవాలి.

## ఆలోచనలే కాలం

మనసులోని ఊహలే కాలాన్ని కల్పిస్తాయి. నదీతీరంలో కూర్చొని, ఆ జల ప్రవాహాన్ని తిలకిస్తూ ఉన్నపుడు కాలంలేదు. ఎందుకంటే అపుడు మనసులో ఆలోచనలు లేవు. ఆలోచనే భవిష్యత్ కాలాన్ని, పరలోకసుఖాదులనూ, ఎన్నింటినో సృజన చేస్తుంది. వర్తమానం నుండి పలాయనం చిత్తగిస్తుంది. మనసు లేని స్థితిలో కాలపుటూహ వుండదు. వర్తమానంలో ఉన్నవానికి ఊహతో పనిలేదు.

## జప - ధ్యానాలు

ఆలోచన నశిస్తే మనస్సు నిశ్చలమవుతుందనే అభిప్రాయం వుంది. కాని నిశ్చలత నిమిత్తం, మనసుకు జపధ్యాన సాధనలు కల్పిస్తే మనసు జడమవుతుంది. ఆలోచన నుండి ముక్తి లభించదు. సాధనంటే వాయిదా వేయటం, భవిష్యత్ కాలం

లోకి వెళ్ళటం. అంచేత ఈక్షణంలో చైతన్యవంతంగా, అప్రమత్తంగా, పూర్తి ఎరుకతో, జీవించడం నేర్చుకోవాలి. అపుడుండేదే ఆనందం! ముందురాబోయే ముక్తి మాకెందుకు ఇక? ఇది దేశకాలాల సారాంశం. కృష్ణజీ స్వయంగా చెప్పిన మాటల్లో దేశకాలాల గూర్చి ఇంకా తెలుసుకుందాం!

## కాలం - ఆలోచనలు, భయాలకు మార్గాలు

భయాన్ని కలిగించేదేమిటి? కాలం, ఆలోచన భయాన్ని కలుగజేస్తున్నాయి. 'నిన్న నేడు రేపు' అనే విధంగా కాలం భయపెడ్తుంది. రేపేమైనా జరగ వచ్చు అనే భయం వుంది. ఉద్యోగం పోతుందనో, చావు మూడుతుందనో, మొగుడుగాని పెళ్ళాంగాని లేచిపోతారనో, గతంలో వచ్చిన జబ్బో, బాధో మళ్లీవస్తుందనో భయం వుంటుంది. ఇలాంటి చోట్ల కాలం ప్రవేశిస్తుంది. రేపు నా ప్రక్క వాడేమంటాడో అనే దానిలో కాలం యిమిడివుంది. కొన్నేళ్ళక్రితం చేసిందెలానో దాచాను అనే దానిలో కాలవుంది. అతి రహస్యంగా వున్న తీరని కోర్కెల వల్ల నాకు భయం. భయంలో కాలం ఇమిడి వుంది. జీవితం చివరిలో వచ్చేది మరణ భయం. అది ఎక్కడో, ఏమూలో దాగివుంది. అదంటే భయం కనుక కాలంలో భయం, ఆలోచన వున్నాయి. ఆలోచన లేకపోతే కాలం లేదు. నిన్న జరిగినదాని గూర్చి ఆలోచించడం, మళ్ళీ రేపు జరుగుతుందేమోనని భయపడడం ఇవే కాలాన్ని కలుగజేసేది, భయాన్ని సృష్టించేది. (TFE-69)

## కాలం - భౌతికం - మానసికం

ఏదో లెక్కల ప్రకారం కాకుండా కాలం గూర్చి చింతించగలమా? మనం కాలం సాధనంగా వాడవచ్చు; కాని దానిలో అర్థం లేదు. ఔందా? కాలం వూహాత్మకం వూహాత్మక అయిందంతా వృథా. కనపడేదాన్నో మానసికమైనదాన్నో సాధించ డానికి మనం కాలాన్ని సాధనంగా వాడుతున్నాం. స్టేషనుకు వెళ్ళాలంటే టైం కావాలి. కాని మనలో ఎక్కువ మంది కాలాన్ని మానసికమైన ధ్యేయం పొందడానికి వాడతాం; ధ్యేయాలు అనేకం. మనం సాధించవలసిన దానికి అవరోధం వచ్చినపుడు మనకు కాలం గుర్తొస్తుంది. విజయవంతం కావడానికి మధ్య వ్యవధి వున్నపుడు కూడా కాలం గుర్తొస్తుంది. "వున్న స్థితికి" కానున్న స్థితికి మధ్యవున్న దేశమే, అంతరమే (Space) కాలం. గమ్యానికి వెళ్లడానికి మొదలుపెట్టడమే కాలం. (COL 1-231)

భౌతికంగానే గాక, మానసికంగా కూడా కార్య-కారణత్వాన్ని కాలవ్యవహారమే అంటాం. కారణానికి, కార్యానికి మధ్యగల వ్యవధిని కాలం అంటాం. కాని వ్యవధి అంటూ వుందా? ఒక రుగ్మతకు సంబంధించిన కారణము, కార్యము కాలం ద్వారా వేరు కావచ్చును. అధికూడా కాలండర్ కాలమే (CHRONOLOGICAL).

అయితే మానసికమైన కారణానికి, కార్యానికి, మధ్య వ్యవధి వున్నదా? కారణం, కార్యం ఒకే ప్రక్రియ (PROCESS) కాదా? కారణం, కార్యం మధ్య వ్యవధిలేదు. ఈ రోజు అనేది నిన్నటికి కార్యం, రేపటికి కారణం. ఇదంతా ఒకే విధానం. అంతరాయం లేకుండా ప్రవహించేది, వేరు వేరు కాదు. కారణం, కార్యం మధ్య స్పష్టమైన రేఖలేదు. కాని ఆంతరికంగా మనం వాటిని వేరుచేస్తాం. ఏదో కావాలని, ఏదో సాధించాలని. నేనిది కావాలి, నేనది కావాలి, అనడం. అది కావాలంటే నాకు టైం కావాలి. మానసిక అవసరాలకు కాలెండరు కావాలి అంటున్నాం. నేను అజ్ఞానిని, నేను జ్ఞానిని కావాలి. అజ్ఞానం, జ్ఞానంగా మారడమనేది అజ్ఞానంలోనే ఉంటూ ముందుకు పోవడమే. ఎందుకంటే అజ్ఞానం ఎన్నటికీ జ్ఞానంగా మారదు. లోభత్వం ఎన్నటికీ ఉదారంగామారదు. ఏదో కావడమనే విధానం అజ్ఞానమే.(COC II-232)

## కాలం-నిర్ణయాలు కాలాతీత తత్త్వం

వ్యవహార రీత్యా కాలాన్నిబట్టి కొన్ని నిర్ణయాలు తీసుకుంటుంటాం. అలాగే కాలాతీతమైన దాని ప్రభావాలు కాలపరిమాణంతో నిర్ణయిస్తే కాలపరంగా చేసినట్లే కదా! కాలం గురించి తీసుకున్న తీర్పులాగానే వుంటుంది కదా! కాలమంటే మన మేమనుకుంటున్నామో అవగతమైతే, కాలాతీతమైంది వుండడానికి సాధ్యంకావచ్చు. కాని ఆ కాలాతీతమైనదాన్ని గూర్చి చర్చించడం సాధ్యమా? అది మనకు ఎరుకైనా, దాన్ని గూర్చి మాట్లాడగలమా? మాట్లాడితే మన అనుభవం కాలాతీతంగా వుండదు. దాన్ని గూర్చి ఎప్పటికీ మాట్లాడలేం. కాలం ద్వారా దాన్ని ఒకరి నుండి ఒకరికి అందించ కలిగితే, కాలం ద్వారా తప్పవేరు విధంగా అందజేయడానికి వీలులేకపోతే, కాలాతీతమైంది అవగాహనకు రాదు. కాలం లేనపుడు మనకు కాలాతీతమైన స్థితి లభిస్తుంది. కాబట్టి అసలు కాలమంటే ఏమిటో ముందు తేల్చుకోవాలి.

ఒకే కాలములో ఒక మానవుడు రెండు వేరువేరు చోట్ల వుంటాడని ప్రతీతి; ఒకే కాలంలో ఒకచోట కొన్ని గంటలు, మరో చోట కొన్ని నిమిషాలు వుంటాడు.

## కాలం అంటే ఏమిటి ?

ఆలోచనా పరుడు ఒకేచోట వున్నప్పుడు, ఆలోచన అనేకచోట్ల తిరగ్గలదు తిరుగుతుంది. నేను ఆ విధానం గూర్చి మాట్లాడడం లేదు. ఒకేసారిగా ఒక భౌతిక మానవుడు పరస్పరం దూరంగా వున్న రెండు స్థానాల్లో వుండడం గూర్చి, ఇక్కడ మనకు ముఖ్యమైంది కాలం. (COL II-106)

నిన్న ఈరోజును రేపటికి మార్గంగా వాడిందనుకో. అంటే గతం వర్తమానం ద్వారా భవిష్యత్తుకు పోయిందంటాం. అది ఒకే కాలగమనం; మూడు వివిధ గమనాలు కావు.

## మనసే కాలం

కాలం మనకు కాలెండరు ప్రకారమున్నూ, మానసికంగాను తెలుసు. పెరుగు దలగాను, మరొకటి కావడంగాను తెలుసు, విత్తు చెట్టుగా వృద్ధిజెందడం మనం మాన సికంగా మరొకటయ్యే ప్రక్రియ తెలుసు. పెరుగుదల స్పష్టమైంది కనుక దాన్ని ప్రస్తుతానికి ప్రక్కనే వుంచుదాం. మానసికంగా మార్పు జెందడంలో కాలమిమిడి వుంది. నేను ఇది కాబట్టి అది కావడం అనే దానిలో కాలం సాధనం గాను, మార్గం గాను వుంది. గతంలో వున్నదేదో ముందు కాబోతున్నది. ఈ ప్రక్రియ మనకు బాగా తెలుసు. కనుక ఆలోచనే కాలం. గతంలోవున్న ఆలోచన ముందు ఈ విధంగా వుండాలనే ఆలోచన ఒక ఆదర్శంగా తయారవుతుంది. కాలం యొక్క ఫలితమే ఆలోచన, ఆలోచనా ప్రక్రియ లేనిదే కాలం లేదు. మనసే కాలాన్ని తయారు చేస్తుంది, మనసే కాలం.

## కాలం—ఆలోచనలు

కాలాన్ని సృజించేది మనస్సే, కాలాన్ని వాడేదీ మనస్సే. అది విస్పష్ట నిజం. మానసిక ప్రక్రియ లేకుండా కాలం లేదు. మనస్సు నధిగమించి పోవడానికి వీలుందా? ఆలోచనకు సంబంధంలేని స్థితి వున్నదా? అది మనం కనుగొందాం. ప్రేమనేది ఆలో చనా? మనం ప్రేమించే వార్ని గూర్చి ఆలోచించవచ్చు. అవతలివారు లేనప్పుడే వార్ని గూర్చి ఆలోచిస్తాం, లేదా వారి రూపమో, చిత్రమో కలిగి వుంటాం. విడిగా వుండడం ఆలోచనకు కారణమవుతుంది.

ఆలోచన కాలబద్ధమైంది. కాలంయొక్క బంధించే గుణం నుండి స్వేచ్ఛ పొందడం సాధ్యమా అని అడుగు చున్నావు. (COL II-107)

## ఆలోచనచేసే సృష్టి

ఆలోచన దేన్ని గూర్చి ప్రతి పాదించినా అది కాలానికి సంబంధించిన క్షేత్రంలోనే ఉంటుంది. అది దేవుణ్ణి కనిపెట్టినా సరే, దాన్ని వూహించినా సరే, స్వర్గాన్ని సృష్టించినా సరే, అదంతా తన సృష్టే, కనుక కాలం సృష్టించిందే. గతానికి సంబంధించింది అసత్యమైంది.

## ఆలోచన—జప—ధ్యానాలు

మానసికమైన కాలం యొక్క స్వభావంలో ఆలోచన ఎంతో ప్రాధాన్యత వహించింది. అంచేత అది గమనించిన మానవుడు ఇంకా అవతల ఏదో వుందని నిరంతరం వెదుకుతున్నాడు. అదేమిటో కనుగొనడానికి పూనుకున్నాడు. నమ్మకంలో తగులుకున్నాడు; భయం ద్వారా అద్భుతమైన దేవతను కనిపెట్టాడు. ఒక ధ్యాన

విధానం ద్వారా కనుగొనడానికి సిద్ధమయ్యాడు. అది ఒక పునరుక్త వ్యవహారం. అది మనసును కొంత నెమ్మదిగా, స్తబ్దతగా వుంచవచ్చు అలాంటి మంత్రాలను నిరంతరంగా ఉచ్ఛరించవచ్చు. అలాంటి పునరుక్తిలో మనసు యాంత్రికమై పోతుంది, అంతేగాక వివేకం కోల్పోతుంది (అంటే ఎలా ఉంటారో?) అలౌకికతలోకి, సహజాతీత స్థితిలోకి, భావాతీత స్థితిలోకి ఎగిరిపోవచ్చును. అది ధ్యానమెంత మాత్రమూ కాదు. (BV-155)

## మానసికమైన కాలం—రేపు

కాలమనేది ముసలితనం, కాలమనేది దుఃఖం, కాలం లక్ష్యపెట్టదు. గడియారం ప్రకారము Chronological క్రమాను గత చరిత్రక కాలముంది అది వుండాల్సిందే. అదే లేకపోతే బస్సు అందుకోలేవు, భోజనం వండుకోలేవు, అలాంటివేమి చేయలేవు. అదిగాక మరోకాలం వుంది. దాన్ని మనం అంగీకరిస్తున్నాం! అదేమంటే "రేపు నేనుంటా, రేపు మారతా, రేపది అవుతా" మానసికంగా, రేపు అనే కాలం సృష్టించాం. మానసికంగా రేపనేది వుందా ? గట్టిగా అడగడానికి ఆ ప్రశ్న భయంతో కూడి వుంది. రేపు కావాలి గనుక, "రేపు కలవటమనే ఆనందం వుంటుంది, రేపు అర్థం చేసుకోబోతున్నాను, నా జీవితం రేపు వేరై వుంటుంది. రేపు జ్ఞానోదయ మవుతుంది." కనుక రేపనేది మన జీవితంలో ముఖ్యమై పోతుంది. నిన్న నీకు లైంగికానందం వుండి వుంది, దానికి సంబంధించిన ఆనందం, బాధలు ఏమైనా కాని, అన్నీ వున్నాయి. అదే మళ్ళీ రేపు నీకు కావాలి, ఎందుకంటే అదే ఆనందం నీకు మళ్ళీ కావాలని కోరుతున్నావు.

## రేపనేది మానసికంగా లేదు

ఆ ప్రశ్న నీకు నువ్వు వేసుకో, వాస్తవమేమిటో గ్రహించు. రేపును ముందు వుంచే ఆలోచనలో తప్ప రేపనేది అసలున్నదా? కనుక ఆలోచన కాలంగా రేపును సృష్టిస్తుంది. మానసికంగా రేపనేది లేకుంటే ఈరోజు జీవితంలో ఏమౌతుంది. అప్పుడు అద్భుతమైన విప్లవం వస్తుంది. అవునా? అప్పుడు నీవు పూర్తిగా నూతనమై పోతావ్. గతం నుండి వర్తమానం ద్వారా భవిష్యత్తులోకి దూసుకు పోవడం కాదు (TA I - 101)

## ఈ క్షణంలో పూర్తిగాజీవించు చాలు

అంటే ప్రతిరోజూ మరణిస్తూ, జీవించడమౌతుంది. అది చెయి. ఈ రోజు పూర్తిగా జీవించడమంటే అర్థమేమిటో తెలుస్తుంది. ప్రేమంటే అది కాదా! "నేను రేపు ప్రేమిస్తా" అని అనవు కదా! అంటావా? ప్రేమించడమో, ప్రేమించక పోవడమో వుంటుంది. ప్రేమకు కాలం లేదు. విచారానికే కాలం వుంది. విచారమే కాలం గనుక

ఆనందమూ అంతే. కనుక ఎవరికి వారు కాలమంటే ఏమిటో తెలుసుకోవాలి. రేపు లేదనేది కూడ తెలుసు కోవాలి. అంటే జీవించడం. శాశ్వత జీవితమంటూ ఒకటుంది, ఎందుకంటే శాశ్వతమనేదానికి కాలం లేదు. (TAI - 102)

## వినటం ధ్యానం

చూడడం అంటే ఏమిటి? దేన్ని చూసి, దాన్ని చూడకుండా వుండడమా? దేశం, కాలం లేకుండ ఒక చెట్టును నిజంగా చూస్తే కేంద్రం (మనస్సు-అహం) లేకుండ చూసినట్లే. కేంద్రం లేనపుడు చెట్టును చూస్తే విశాలమైన, అప్రమేయమైన దేశం వుంటుంది. అయితే ఎలా చూడాలో నేర్చుకోవాలి లేక గమనించాలి లేక వినాలి. అది చేయరు. అది చేయకుండ జీవితమనే అసలు క్లిష్టమైన దానిని, ఏదో సరళంగా అనుకుంటూ మొదలు పెడతారు. ఈ సరళత అంటే వేషం వేసుకొని మూడవ క్లాసులో ప్రయాణం చేయడం, ధ్యాన మనబడేదో లేక ఇంకేదో చేయడం, అది సరళత కాదు. సరళత అంటే ఉన్నవాటిని ఉన్నట్లుగా చూడడం. కేంద్రం లేకుండ ఒక చెట్టును చూడడం (TAI - 272)

## గతం

సాంకేతిక ప్రపంచములో గతమంటూ వుండాలి. ఇతరమైన జీవితక్షేత్రంలో గతం లేదు. ఇది గుర్తిస్తున్నామా? (TAI - 283)

## కపట జీవితాలు

మీరు గడిపే ద్వంద్వజీవితం కనిపిస్తుంది; అంచేత మీరు భయంకరమైన జీవితాన్ని తయారు చేస్తున్నారు. ఒక ప్రక్క దేవాలయానికి వెళ్తారు, మరోప్రక్క యంత్రం నడుపుతారు. విభూదో ఏదో పెట్టుకొని ఆఫీసుకు వెళ్తారు. అదొక రకమైన పిచ్చి. ఇదెలా సాధ్యమవుతుంది. ఈ ప్రశ్న అర్థమైందా? ఇదెలా సాధ్యమో చెప్పండి. ఇది కపట జీవితం కాదంటారా? (TAI - 283)

## విభాగం లేని జీవితం

నేనిపుడేమి వివరించాలని యత్నిస్తున్నానో గ్రహించండి. ఏ విభాగం లేని జీవితాన్ని గడపగలనా? అది లైంగిక జీవితం కావచ్చు, సాంకేతిక పరమైనది కావచ్చు, రాజసమైంది-కోపిష్టిది-కావచ్చు! అర్థమవుతుందా? అంటే విభాగాలు, ముక్క-చెక్కలు లేని జీవితం గడప వచ్చునా? (TAI-284)

## ఎవరికివారు కనుగొనాలి

ఆలోచన ఎప్పుడూ పాతదే! సరే! అయితే ఎవరికి వారు ఈ సత్యం కనుగొనాలి. నే చెప్పినది వల్లించరాదు. స్వయంగా కనిపెట్టండి. అసాధారణమైందని తెలుస్తుంది. ఆలోచన నిజంగా పాతదేనని తెలిస్తే గతమంతా పోతుంది. శంకరుడు,

బుద్ధుడు, క్రీస్తు-ఎవరు చెప్పిందైనా సరే, మొత్తం మొత్తం, ఎగిరి పోతుంది. పోదా? కాని అది కనుగొనవు, ప్రయత్నించవు, అసలు కనుగొనాలని నీకు లేదు!

## చిలుకపలుకులు పనికిరావు

అయ్యలారా! అర్థమైందా? ఆలోచన ఎప్పుడూ పాతదే! జాగ్రత్తగా అనుసరించండి. ఆదిశంకరుడు-పాతచిలుక-ఏదో చెప్పాడు. అతని ఆలోచన ఎప్పుడో పాతపడింది అర్థమౌతున్నదా? కనుక అతడు చెప్పింది ఎప్పటికీ వర్తమానంది-కాదు-ప్రస్తుతానికి చెల్లదు. అతడు విన్నదేదో సొంతమాటల్లో వల్లించాడు. అలాగే మీరతను చెప్పింది వల్లిస్తున్నారు. కాని ఆ యాలోచన ఎప్పుడు కొత్తది కాదు. ఈనాడు, ప్రతిరోజు జీవించడం చురుకైన వర్తమానం. అది ప్రస్తుతం క్రియాత్మకం. కనుక ప్రస్తుతంవున్న చురుకుదనాన్ని, గతంతో అర్థం చేసికోవడానికి ప్రయత్నిస్తే ఆలోచన అవుతుంది. అలాగే ఆలోచనతో ఎన్నటికి అర్థం చేసికోలేవు. కనుక విభజన ఏర్పడుతుంది. అపుడు జీవితం సంఘర్షణ మయమవుతుంది.

## గడపాల్సింది వర్తమాన జీవితం

ఒకే చురుకైన జీవితాన్ని ప్రస్తుతం, అనగా వర్తమానంలో పూర్తిగా గడపగలవా? జీవించలేకుండ వుండడానికి కారణం నీవు గతమైపోవడమే. గతం నుండి పూర్తిగా తొలగిపోతే జీవించలేవు, ఇది అవగతం కావాలి. కేవలం ప్రతిసారి వింటే సరిపోదు. (TAI - 290)

## మౌనంలోనే నిజమైన చైతన్యం

స్మృతి నుండి, జ్ఞానము నుండి, అనుభవం నుండి, కాలం నుండి, స్పందించిన ఆలోచనయే చైతన్యం: ఆలోచన పనిచేసేది జ్ఞానంతోనే. అది వివేకంతో పనిచేయగలదు. కాని అత్యుత్తమంగా పనిచేసే దెప్పుడంటే దేశం (Space) మౌనం వున్నప్పుడు మాత్రమే. (TAI - 371)

ఆలోచన అంతమైతేగాని మౌనం, దేశం, అసాధారణ కాలమాన భావన కలగదు. (TAI - 429)

## మానసికంగా కాలంలేదు

రేపు నిన్ను చెట్టుక్రింద కలుస్తాననడం క్రమాను గత కాలం. రేపటిని గూర్చి భయపడుతున్నాననడం మానసిక కాలం, అసలు మానసికంగా కాలమంటూ వున్నదా? (TAI - 431)

## భయం

నాకు గాయం తగుల్తుందేమోనని ప్రతి మానవ సంబంధాన్ని నెట్టివేస్తుంటాం

అందువలనే భయం. గత గాయపు జ్ఞానం భవిష్యత్ గాయపు భయాన్ని కల్గిస్తుంది. కనుక జ్ఞానమే భయాన్ని కల్గిస్తుంది. అయినా నాకు జ్ఞానం కావాలి? (TAI-433)

## సరిగా చూడడం

మనస్సు పూర్తిగా నిశ్చలమైనపుడు అంటే ప్రతిబింబం లేనపుడు అవగాహన వుంటుంది. (TAI - 193)

దేనివంక చూసినా నీకూ, దానికి మధ్యదూరం లేకుంటే అది సరిగా చూడడం అవుతుంది. ప్రేమ వున్నపుడు మాత్రమే అలా చూడగలవు. (TAI - 193)

## ఖాళీ—క్రమత

మన బుర్రలు జ్ఞానంతో, విహారాల్తో, సమస్యల్తో, డబ్బుతో, హోదాతో, పదవితో గజిబిజిగా వున్నాయి. ఆ విధంగా కొట్టుమిట్టాడు చుండడంతో అసలు ఖాళీయే లేదు, ఖాళీలేనిదే క్రమత లేదు. (TWL - 175)

ఉద్దేశమో, ధ్యేయమో, సాధించాలనే కోర్కెగాని వుంటే, అక్కడ ఖాళీయే వుండదు. ఏకాగ్రతవల్ల ఖాళీ వుండదు. అది లేక విశాలమైన ఖాళీ వుంటుంది. (TWL-175)

## కేంద్రం లేకుంటే విశాలత

కేంద్రీకరించి చూస్తే ఖాళీ చాలా పరిమితంగా వుంటుంది. కేంద్రం లేనపుడు, "నేను" అనేదాని రూపం లేనపుడు విశాలమైన ఖాళీ వుంది. ఖాళీలేందే క్రమత లేదు, స్పష్టతలేదు, కరుణ లేదు. (TWL-175)

## కాలం—చైతన్యం

చైతన్యం కాలంతో రూపొందింది. చైతన్యమే కాలం. దాన్ని రక్షించడానికి యత్నిస్తున్నాము. ఉనికి లేనిదాన్ని రక్షించడానికి యత్నిస్తున్నాము. (TR-D.9)

చూడండి; రేపనేది నాకు స్థిరపడాలి. "నాకు తెలుసు" అనే జ్ఞానం ఉన్నపుడు మాత్రమే స్థిరత్వం (Certainity) ఉంటుంది. గతం తప్ప నాకేమైనా తెలుసా? "నాకు తెలుసు" అన్న క్షణంలోనే అది గతంలోకి పోతుంది. "నా భార్యా తెలుసు" అని అన్నపుడు ఆమె గతాన్ని బట్టేగదా తెలియడం. గతాన్ని గూర్చి స్థిరత్వం ఉంది. భవిష్యత్తును గూర్చి లేదు. గతంలో పూర్తి భద్రత వుంటుంది. కనుక గతంలోకి భవిష్యత్తును లాగాలనుకుంటున్నా. (TAI-425)

ఇపుడు ఆలోచన పనిచేసేటప్పుడు భయం ఉత్పన్న మవుతుందని తెలిసింది. ఇక రేపటి గూర్చి ఆలోచించక పోతే భయమే లేదు. (TAI-425)

ప్రయత్నం లేని చోట, సంకల్ప చర్య లేనిచోట జీవించడం ధ్యానంలో ఒక భాగం. (TWI-175)

# వ్యక్తి - సంఘం - సంఘర్షణ

## జీవుడే వ్యక్తి

వ్యక్తమైన నాడు, వ్యక్త పరచబడినవాడు వ్యక్తి. వ్యక్తము కావడమంటే రూపొందడము, తెలియబడడం. ఒక తీరు, తెన్ను ఏర్పడడం. దేశం చక్కగా పెరగడం, మనస్సు సమగ్రంగా వికసించడం, హృదయ వైశాల్యం కావడం. అపుడు మనిషి తనకు పూర్తిగా సమకూరుతుంది. తనలో తన సంబంధం, ఇతరులతో సంబంధం, పరిసరాలతో సంబంధం, విషయాలతో సంబంధం, అన్నీ ఏర్పడతాయి. జీవుడు ఇన్నిటితో పెరిగాడు, తయారయ్యాడు. అలాంటి జీవుడే వ్యక్తి అంటేనే సంబంధం.

## వ్యక్తియే సమాజం

వ్యక్తులు కలిస్తే సంఘం అయింది. అదే సమాజం. వ్యక్తులు లేకుండా సంఘం గుర్తింప బడదు. వ్యక్తిని బట్టియే సంఘం వుంటుంది. వ్యష్టియే సమిష్టి. కాని సమిష్టియే వ్యష్టి అవడానికి వీలులేదు. జీవునికి వ్యక్తిత్వం, అస్తిత్వం వున్నాయి సంఘానికి వ్యక్తిత్వం లేదు. స్వతంత్రమైన అస్తిత్వమూ లేదు. పరాధీనమైన అస్తిత్వం వుంది. అంటే అది వ్యక్తులపైన ఆధారపడ్డది. దానికి ఒక రూపం అంటూ లేదు. ఏకీకృతంగా లేదు. సమూహ రూపం స్థిరమైంది కాదు. వ్యక్తితో వ్యవహరించినట్లు, సమాజంతో వ్యవహరించడానికి వీలులేదు. అది ఒక యూనిట్‌గా లేదు. చక్రాలు, ఇంజను, సీట్లు, తలుపులు, అద్దాలు మొదలగునవన్నీ కలిస్తే బస్సు అయింది. బస్సుతో వ్యవహరించవచ్చు, కాని సమాజం అలా తయారయింది కాదు. సమాజముతో వ్యవహరించడమంటే వ్యక్తులతో వ్యవహరించడమే.

వ్యక్తి వాస్తవం. కొన్ని వాస్తవాల కలయిక సమాజం. అంతే కాని అది ఒకే వాస్తవ లక్షణం కలిగింది కాదు. మానసికంగా కలుపుకొన్న భౌతిక వ్యక్తుల కూడలి. ఇది వ్యక్తికి, సమిష్టికి గల సంబంధం.

"మా తెలుగుతల్లికి మల్లెపూదండ" అని పాడతాం. తెలుగుతల్లి వుందా? లేదు, అది వూహ. అయితే తల్లికి గుణం, లక్షణం, రూపం మనం ఆపాదిస్తున్నాం. సమాజం కూడ అలాంటిదే. వాస్తవాన్ని గుర్తించకుండా వూహ మీదే అల్లుకుపోతూంటాం. అది రాను రాను వాస్తవమనే భ్రమ కల్పిస్తుంది. అయితే సమాజాన్ని బట్టి వ్యక్తి తయారౌతాడు అనేది వుంది. తయారు కావలసిన వాడు సమాజంలో ఇతరులను అనుకరిస్తాడని అర్థం. సమాజ సంబంధం యొక్క ప్రభావం అతని మీద పడుతుంది. సంఘం నియమాళ్ళు, నీతులు సమాజ సంబంధం వ్యక్తికి వర్తిస్తాయి.

అయితే వ్యక్తుల ప్రవర్తన, ప్రభావమే సహజ లక్షణం. సామూహిక లక్షణం వ్యక్తి నుండి సమాజం, సమాజం నుండి వ్యక్తి తయారౌతారంటే అర్థం ఇదేయే దానిని బట్టి. వ్యక్తి ముఖ్యమా, సమాజం ముఖ్యమా? అనే ప్రశ్న ఉదయించింది.

## వ్యక్తి మారితే వ్యవస్థ మారుతుంది

వ్యక్తి మారితే సమాజం మారుతుందా అని ప్రశ్నిస్తారు. వ్యక్తి మారందే సమాజం మారుతుందా అని తిరిగి ప్రశ్నించవలసి వస్తుంది. వ్యక్తులతో కూడింది సమాజం కనుక వ్యక్తులు మారితేనే సమాజం మారుతుంది. నియంతలాంటి ఒక వ్యక్తి సమాజాన్ని నిర్దేశించవచ్చు. సమాజంతో ఇలాంటి లక్షణాలు, పద్ధతులు ఉండాలని ఆదేశించవచ్చు. ఆ విధంగా వ్యక్తులు వుండాలని బలవంతం చేయవచ్చు. అపుడు సమాజాన్ని బట్టి వ్యక్తులు తయారౌతున్నారని అంటారు. అయితే అందులో వత్తిడి వుంది. వత్తిడిలో వచ్చింది ఎప్పటికైనా వీగిపోతుంది. సాధన హింసతో కూడి వుంటుంది. ఫలితం "అహింస" అవుతుందని ఆశిస్తాము.

మారే స్వేచ్ఛ వ్యక్తికి వుంది. సమాజానికి దూరంగా వుండే స్వేచ్ఛకూడ వుంది. సమాజాన్ని మార్చడానికి వ్యక్తికి శక్తి వుంది. సమాజం వ్యక్తిని లోబరచు కుంటుందేకాని స్వేచ్ఛనివ్వదు. ఉన్న స్థితిని అది స్థిరీకరిస్తుంది. ఎదగనివ్వదు. బలహీనుడు సమాజం మారితేగాని మారలేడు, బలవంతుడు సమాజాన్ని ఎదిరిస్తాడు. తాను మారతాడు, మార్పు తెస్తాడు.

హృదయ పరివర్తన ద్వారా వ్యక్తి మారితే సమాజం మార్పు స్వచ్ఛందంగా వుంటుంది. అంతేగాక స్థిరంగా వుంటుంది. మరింత సహేతుక పరిణామానికి కూడ అవకాశమిస్తుంది.

మార్పుకు ఇష్టపడని "సమాజం" కుక్కలాంటిది". మార్పుచెందే వ్యక్తిని చూసి మొరుగుతూ వుంటుంది. వెంటపడుతుంది లెక్కపెట్టకపోతే మొరిగి మొరిగి నోరు మూసుకుంటుంది. రాళ్ళు విసిరితే ఇంకా మొరుగుతుంది. గట్టిగా కొడితే పారి పోతుంది. మాంసమో, రొట్టో ఒక ముక్క పడేస్తే పూరుకుంటుంది. కాని మార్పులో నిజమైన ఆసక్తి కలవాడు సమాజాన్ని లెక్క చేయడు. ఉదాసీనంగా, ఔదార్యంగా నిర్లిప్తంగా తనపని చేసుకుంటూ పోతాడు.

## సమాజంలో ఘర్షణ :

వ్యక్తిలో వ్యక్తికి, వ్యక్తితో వ్యక్తికి, సమాజంతో వ్యక్తికి, భావాలతో, నమ్మ కాలతో, పరిసరాలతో, ప్రకృతితో వ్యక్తికి సమాజానికి వ్యతిరేకతలు వస్తుంటాయి.

అవే ఘర్షణలు. ఘర్షణ అనగా అలజడి. యదార్థాన్ని వదలి అభిప్రాయాలతో బ్రతకాలనుకోవడం ఘర్షణ. ఒకే మనిషికి, ఒకే విషయంపై భిన్నాభిప్రాయాలుంటాయి. అనేకులకు అనేకాభిప్రాయాలుంటాయి. అభిప్రాయాలు మారుతుంటాయి. పరస్పరం వ్యతిరేకంగా వుంటాయి, వాస్తవం వేరు, వాస్తవాన్ని గూర్చిన విషయం వేరు. ఆలోచనే అభిప్రాయం అందుచేత అభిప్రాయాలు యదార్థం కాదు. జీవించడమే యదార్థం కనుక అభిప్రాయాలతో ఎల్లప్పుడూ ఘర్షణే వుంటుంది. ద్వంద్వవైఖరి వున్నా, రెండు నాల్కలతో మాట్లాడినా ఘర్షణే. మాటకూ, చేతకూ, పొంతన లేకపోయినా ఘర్షణే.

అవాస్తవ విషయాలమీద కూడ అభిప్రాయాలేర్పడతాయి. అవే నమ్మకాలు. నమ్మకాలతో ఎప్పుడూ ఘర్షణ వుంటుంది. నమ్మి ఎంతకాలం అనుష్ఠానం చేసినా ధ్యేయం లభించలేదనేది ఘర్షణ. లోకం గురించి చేస్తున్నాను కాని, ఆసక్తివుండి చేయడం లేదనటం ఘర్షణే. సంఘానికి జంకి కలిసి వున్నాము కాని ప్రేమ వుండి కాదని భార్యాభర్తలలో, ఏ వొక్కరన్నా ఘర్షణే.

మానసికమైన జ్ఞానం ఘర్షణకు కారణం కనుక జ్ఞానమే ఘర్షణ. అవసరానికి మించి గుర్తించడం ఘర్షణ. ఇంటికి వచ్చిన మనిషి పేరు, పని, చాలకపోతే వృత్తి తెలిస్తేచాలు, అతని కులం, మతం, ఘనతలు, ఆరోపితములు విచారించడం అనవసర జ్ఞానం. కనీసానికి మించిన ఆలోచనే ఘర్షణ. కులాలు, మతాలు, దేవుళ్ళు మున్నగు కల్పిత విషయాలన్నీ ఘర్షణలే. జాతీయత కూడా ఘర్షణే.

ఈర్ష్య, ద్వేషం, క్రోధం, లోభం, సంపాదన, స్వార్థం, డంబం ఇలాంటివన్నీ ఘర్షణలు. ఘర్షణకు కారణాలు, వాస్తవాన్ని వదలి ఆదర్శాన్ని వూహించుకోవడం కూడా ఘర్షణే. మనసు నిబ్బరంగా వుండకపోవడం ఘర్షణ. వేళకు నిద్రపట్టకపోవడం ఘర్షణ. మనసు అస్పష్టంగా వున్నా ఘర్షణే, బుర్ర ఖాళీగా లేకపోయినా ఘర్షణే. వూహ ఘర్షణ, గతం ఘర్షణ, భౌతిక అవసరాలు, మానసిక తృప్తికి వాడడం ఘర్షణకు మూలం, పోటీలో ఘర్షణ వుంది. పోల్చుకోవడంలో ఘర్షణవుంది.

ఘర్షణ వల్ల శక్తి వృథా అవుతుంది. అశాంతి కలుగుతుంది. ఉచ్చనీచాలు హెచ్చు తగ్గులు వస్తాయి. గందరగోళం పుడుతుంది. ఆందోళనలు, యుద్ధాలు చెలరేగుతాయి. సంఘర్షణ అంటే మంచి ఘర్షణ కాదు, బాగా ఘర్షణ వుండడం.

వ్యక్తిలో సమాజంలో ఘర్షణ తొలిగే వీలుందా? అందుకు కృష్ణజీ చెప్పినదేమిటో విచారిద్దాం.

....O....

# వ్యక్తి - సంఘం

## వ్యక్తిపై సమాజ ప్రభావము :

వ్యష్టి సారాంశికంగా సమిష్టే. వ్యక్తి సృష్టించేదే సమాజం. వ్యక్తి, సమాజం పరస్పరానుబంధాలు వేరు వేరు కావు. వ్యక్తి సమాజ నిర్మాణం చేస్తాడు. సమాజం లేక పరిసరం వ్యక్తిని (రూపొందిస్తుంది పరిసరం వ్యక్తిని నిబద్ధిస్తుంది.) వ్యక్తి ఎప్పుడైనా విముక్తి చెందగలడు. గత స్థితి నుండి వేరు కాగలడు. తాను దాసుడయిన పరిసరానికి తాను సృష్టికర్త. దానినుండి తొలగే శక్తి కూడా అతనికి వుంది. తన మనసును, ఉత్సాహాన్ని క్రొంగదీయని పరిసరాన్ని కూడా సృష్టించుకో గలడు. తన నిబద్ధత నుండి విడుదల కావడంలోను, వాస్తవాన్ని అర్థం చేసుకోవడంలోను వ్యక్తి ప్రాముఖ్యత వహించాడు. నిబద్ధతలో కాఠిన్యంగా వుండే వ్యక్తి హింస, ద్వేషాలను పునాదులలో సమాజాన్ని సృష్టిస్తాడు. (COL II-81)

## మానవ సంబంధాలే సమాజం :

సమాజమంటే మనుషుల మధ్య వుండే సంబంధం. ఒకరికొకరి మధ్య వుండే సంబంధం, ఒక కుటుంబానికి మరొక దానికి మధ్య వుండే సంబంధం, ఒక వర్గానికి మరొక వర్గానికి మధ్యగల సంబంధం, వ్యక్తికి, వర్గానికి మధ్యగల సంబంధం. మానవ సంబంధమే సమాజం· మీకు, నాకు మధ్య గల సంబంధమే అది· నేను లోభిని, యుక్తి పరుణ్ణి గొప్ప శక్తి, అధికారం గల వాణ్ణయితే మిమ్మల్ని నెట్టివేస్తాను. మీరు కూడ అదే చేయాలని చూస్తారు. కనుక మనం చట్టం చేస్తాం. ఇతరులు వచ్చి మన నిబంధనల్ని వుల్లంఘిస్తారు. వేరే నిబంధన ఏర్పాటుచేస్తారు. ఎప్పుడూ ఇది జరుగుతూ వుంటుంది. మానవ సంబంధ మైన సమాజంలో ఎప్పుడూ ఘర్షణే. సమాజానికి ఘర్షణ ప్రాతిపదిక అయింది. మానవులు తమ అభిప్రాయాల్లోను, కోర్కెల్లోను, సంస్థలోను, పరిశ్రమలోను, ఎంత చిక్కుగా తయారైతే సమాజం అంతగా చిక్కులకు లోనవుతుంది (LH-59)

## సమాజానికి కట్టుపడిన మనస్సు బంధకారి :

మనం ఒక నీతి మీద, హింస మీద ఆధారపడ్డ సమాజానికి అలవాటు పడ్డాం. మనకు తెలిసో, తెలియకో చిన్నప్పటినుండి హింసతో, అనుకరణతో తయారయ్యాం. స్థిరమైన అభిప్రాయాలతో తయారు చేయబడ్డాం. దాని నుండి బయట పడడం మనకు తెలియదు. అది సాధ్యం కాదని మనకు మనమే అను కుంటాం. మనిషికి హింస తప్పదని అనుకుంటాం. ముసుగులో మెత్తగా, అలా అలా హింస చేయవచ్చు. కనుక ఆ సమస్య లోతుగా పరిశీలించాలి. ఎందుకంటే

హింస, భయం గూర్చి అవగాహన లేకుండా ప్రేమ ఎలా వుంటుంది. ఒక సమాజ పద్ధతిలో స్థిరపడ్డ మనస్సు, ఒక సిద్ధాంతానికి కట్టుబడ్డ మనస్సు, నీతే లేని ఒక రకమయిన సామాజిక నైతికతకు లోబడ్డ మనస్సు మత నమ్మకానికి నిబద్ధమైన మనస్సు దైవభావాన్ని అంగీకరించడానికి, నిరాకరించడానికి అలవడ్డ మనస్సు పోరాటంగాని లేకుండా తనకు తాను విముక్తి చెందగలదా? హింస మరింత హింసను తెచ్చి పెడుతుంది. వ్యతిరేకత ఇతరత్రా మెలికలు తెచ్చి పెడుతుంది.
(BL-110)

### అవినీతి సంఘ లక్షణం :

ఎలాంటి విశదీకరణ లేకుండా ఇతరులు కష్టాలు, నిరుత్సాహాలు మొదలైనవి అధిగమించడానికి మనం సాయంచేస్తుంటాము. ఈ సమాజానికి సరిపడే వాళ్ళగా తయారు చేయాలని ప్రయత్నిస్తున్నాం. (COL-II 169)

ఈ అవినీతి కరమైన సమాజంలో మనుషుల్ని ఇరికించడానికి యత్నించడం అంత ప్రాముఖ్యమంటారా? (COL II-169)

### సమాజ గత మనసు అవినీతి మయం

మనస్సు సమాజం వల్ల మలచ బడ్డది. సంస్కృతి ద్వారా తయారై పోషింపబడ్డది. సమాజం అవినీతి మయం. ఎప్పుడూ అ స్థితిలో వుంటుంది. లోలోన క్షీణిస్తుంది. తనకు తానే నాశనకారి. అంచేత సమాజం ప్రభావంలో ఉండే మనస్సు కూడ అవినీతి మయంగా ఉంటుంది. కృశించి పోతూ ఉంటుంది. అంతేకదా.
(CL III-69)

### ఈ సమాజం మనిషిని పతనం చేస్తుంది :

సమాజం నశించిపోయే స్వభావం కలది. పరిపూర్ణమైన (Perfect) సమాజం అంటూ లేదు. పరిపూర్ణ సమాజం అంటే లోభత్వం, ఈర్ష్య, సంపాదన, అస్థిరమైన ఆనందం, అధికార తాపత్రయం మొదలైన వాటితో ప్రోద్బలమైన మానవ సంబంధం. ఈర్ష్యను అభివృద్ధి పరచలేము. అది ఆగిపోవాలి. రెండు నాల్కల ధోరణిలో ఆదర్శాలు వల్లిస్తూ నాగరికమైన ముసుగులో కప్పితే సరిపోదు. అంతమాత్రాన హింస ఆగిపోదు. ఈ సమాజానికి తగినట్లుగా స్థిరపడమని బిడ్డలకు చదువు చెప్పడం, వినాశం వైపున ప్రేరణ భద్రంగా వుండేటట్లు ప్రోత్సహించడమే, నెగ్గడమనే నిచ్చెనకు ఎగబ్రాకడం, ఎవరిగానో తయారవడం, గుర్తింపు పొందడం- మన వినాశనానికి కారణం సమాజ నిర్మాణానికి మూలం. దానిలో భాగం పంచు కోవడమంటే దిగజారి పోవడమే. (CL III-69)

### సమాజ నీతి

సామాజిక నీతి అంటే కేవలం మర్యాద. అపేక్ష, లోభం, ఏదో సాధించా

నన్న భ్రాంతి, దాన్ని గుర్తింపు, పదవి అధికారం యొక్క క్రూరత్వం, ఒక సిద్ధాంతం (Ideology) పేరుతోనో, దేశం పేరుతోనో చంపడం సమాజ నీతి అయింది. (CL III-130)

సమాజం ప్రజా పీడనాత్మకంగా వున్నా, ప్రజాస్వామ్యం పేరుతో వున్నా మార్పు సున్నా, ఏ సమాజ విధానంలోను మొత్తం మార్పు ఎప్పుడూ రాదు. (CL III-132)

నమ్మకాలమీద, వాటితో కూడిన మతం మీద, మతం పేరుతో వున్న సంప్రదాయం మీద, కొన్ని ఆర్థికాంశాలమీద, సమాజం ఆధారపడి వుంది. అంతేకదా, నీవు దానిలో ఒక భాగానివి. వానితో సర్దుకుపోవడానికి అవస్థ పడుతున్నాము. ఆ సమాజం అర్జనం నుండి కల్గింది. ఈర్ష్య, భయం, లోభత్వం, సంపాదనా యత్నాలు, అపుడపుడు తళుకుమనే ప్రేమ, వాటినుండి పుట్టిందే సమాజం. తెలివిగా వుండాలన్నా, నిర్భయంగా వుండాలన్నా, నిస్సంపాదనతో వుండాలన్నా అలాంటి సమాజంతో సర్దుకోగలవా?  (LH - 131)

## కుటుంబం చేసే హాని 

కుటుంబం ఏర్పడడానికి వివాహం ఒక వ్యవస్థ అని భావిస్తున్నారా? కుటుంబమనేది ఒక యూనిట్‌గా సమాజానికి విరుద్ధంగా లేదా? క్రియా కలాపం మొదలయ్యే కేంద్రం లేదా మిగతా సంబంధాలపై ఆధిక్యత వహించే వేర్పాటు సంబంధం కదా? తన్ను తాను కప్పేసుకొనే చర్య కాదా? విభాగాన్ని, వేర్పాటును, ఎక్కువ వాళ్ళని, బలవంతుల్ని, బలహీనుల్ని సృష్టించేది కాదా? కుటుంబం ఒక సంస్థగా మొత్తాన్ని వ్యతిరేకిస్తుంది. ప్రతి కుటుంబం ఇతర కుటుంబాల్ని వ్యతిరేకిస్తుంది. ఇతర వాటిని కాదంటుంది. ఆస్తితో కూడి కుటుంబం యుద్ధానికి కారణం అవడం లేదా?

 (COL III - 110)

ఇక్కడ కుటుంబం కాదు సమస్య, భద్రత నిమిత్తమైన కాంక్షే సమస్య. భద్రత నిమిత్తమైన కాంక్ష వేర్పాటుతనమైంది కాదా? వేర్పాటు భావనయే కుటుంబంగా, సంపాదనగా, రాష్ట్రంగా, మతంగా, అలా అలా రూపొందుతుంది. అంతర్గత భద్రత పట్ల వున్న కోర్కె భద్రతకై బహిర్గత రూపాలు వెతుకుంటుంది. అవి ఎప్పుడూ వేర్పాటువే. భద్రతను కోరే కోర్కెయే భద్రతను భంగపరుస్తుంది. విడితనం, వేర్పాటు వాదం తప్పని సరిగా విచ్ఛిత్తి తెచ్చిపెడతాయి. జాతీయత, వర్గ వ్యతిరేకత, యుద్ధం, వేర్పాటు తనం యొక్క లక్షణాలు, అంతర్గత భద్రతకు సాధనమైన కుటుంబం అక్రమతకు, సమాజిక వైపరీత్యానికి ఆధారం అవుతుంది. (COL II - 111)

## ఇతరుల్ని వాడుకోవడం అంటే ఏమిటి?

## పరస్పర సంబంధాలలోనున్న అవినీతి

వాడుకోవడం సులభమే. మనం ఒకరినొకరం పరస్పర సంతృప్తికి వాడుకుంటాం. ప్రస్తుత సమాజ నిర్మాణం అదే. మన సంబంధం అవసరంమీద, వాడుక మీద ఆధారపడింది. అధికారంలోకి రావడానికి నీకు వోట్లు కావాలి. నీవు పొందా అనుకున్నదానికై మనుష్యుల్ని వాడుకొంటావు. వాళ్ళకు కావలసినది వాగ్దానం. ఆడదానికి మగవాడుకావాలి. మగవాడికి ఆడది కావాలి. మన ప్రస్తుత సంబంధం అవసరం వాడుక మీద ఆధారపడింది. అలాంటి సంబంధం లోనే హింస ఇమిడివుంది. సామాజిక నిర్మాణం పరస్పర అవసరం-వాడుక మీద ఆధారపడి వున్నంత వరకు హింస, చీటలు తప్పవు. నా వ్యక్తిగత సంతృప్తికి నేనమ్మిన సిద్ధాంత సాధనకు నేను ఇతరుల్ని వాడినంత కాలం భయం, అపనమ్మకం, వ్యతిరేకత వుంటాయి. అలాంటప్పుడు సంబంధం అనేది ఆత్మ వేర్పాటు తనం, విచ్ఛిన్నత్వం అవుతుంది. వ్యక్తి జీవితంలోను, లోక వ్యవహారాల్లోను ఇది వాస్తవమైంది, బాధాకరమైంది. (COL II-69)

## ఒకరిని మరొకరు వాడుకోవడమే సమాజం

నాకు తపాల మనిషి కావాలి. అతన్ని నాలో దాగిన కోర్కె నెరవేర్చుకోడానికి వాడితే అది సామాజిక అవసరం, మానసిక అవసరం అవుతుంది. మన సంబంధం వేరే అవుతుంది. ఈ మానసిక అవసరం, అంటే ఇతరుల్ని వాడడం, హింసకు, దుఃఖానికి ఆసరా ఇస్తుంది. మానసిక అవసరం అధికారానికై వెదకే అవసరం తెచ్చిపెడుతుంది. మన ఉనికికి సంబంధించిన అనేక స్థాయిల్లో మానసిక తృప్తికి అధికారం వాడతాం. తనకుగాని, తన పార్టీకి గాని తాపత్రయ పడే వాడు, ఒక ఆదర్శం సాధించాలని కోరేవాడు సమాజంలో విచ్ఛిత్తికి కారకుడని తెలుస్తూనే వుంది. (COL II-69)

అవసరం, ఇతరుని వాడడం, తప్పనిసరిగా అధికారానికి, అధిపత్యానికి దారితీస్తాయి. ఒక అభిప్రాయానికి సంబంధించిన అధికారము ఖడ్గానికి సంబంధించిన అధికారము రెండూ ఒకటే. రెండూ నాశనం చేసేవే. ఖడ్గం లాగానే అభిప్రాయమూ, నమ్మకము ఒక మనిషికి వ్యతిరేకంగా మరొక మనిషిని తయారు చేస్తాయి. అభిప్రాయము, నమ్మకము ప్రేమకు పూర్తిగా విరుద్ధమైనవి. (COL II-70)

## నేటి విద్య మనిషిని ప్రేమకు దూరం చేస్తుంది

నీవు నన్ను ప్రేమిస్తున్నావు కనుక నేను నిన్ను ప్రేమిస్తున్నాననేది ఒక వ్యాపారం. అది మార్కెట్టులో కొనుక్కొనేది ప్రేమ కాదు. ప్రేమించడం ప్రయోజనం కోరేదికాదు. ఏదో ఇస్తున్న భావనకూడ వుండరాదు. అలాంటి ప్రేమయే

స్వేచ్ఛను ఎరుగ గలదు. కాని మీకు ఈవిధమైన విద్య అబ్బలేదు. మీరు లెక్కల్లో, కెమిస్ట్రీలో, జాగ్రఫీలో, హిస్టరీలో తర్ఫీదు అయ్యారు. అది అంతటితో ఆగి పోయింది. మీ తల్లిదండ్రులకు అంతవరకే పట్టింది, మీకు మంచి ఉద్యోగం వస్తే చాలు, జీవితం విజయవంతం అయితే చాలు. వాళ్ళకు డబ్బుంటే బిడ్డల్ని ఇతరదేశం పంపుతారు. ప్రపంచములో ఇతరుల మాదిరిగానే డబ్బు సంపాదించడమే ధ్యేయం. సంఘంలో గౌరవంతో కూడిన పదవులు పొందడమే ధ్యేయం. ఎంత ఎత్తుకు పోతే అంత దుఃఖం ఇతరులకు తెచ్చిపెడతారు. అంత ఎత్తుకు ఎదగాలంటే మీరు పోటీ పడాలి, కటువుగా వుండాలి. కాబట్టి ఆశ, పోటీ, కాఠిన్యం వున్న స్కూళ్ళకే తల్లిదండ్రులు తమ బిడ్డల్ని పంపుతారు. అందుకే మన సంఘం ఎప్పుడూ గుల్లబారి పోతుంది. నిరంతరం చీకాకులతో కూడి వుంటుంది. రాజకీయ వాదులు, న్యాయవాదులు, మహాపురుషులు, మహాత్ములనబడే వారు శాంతి గూర్చి ఎంత మాట్లాడినా అందులో అర్థం, పర్థం వుండదు. (TMOC - 29)

## సమాజానికి ప్రమాదకరమైన వ్యక్తి

స్థిరమైన పద్ధతిలో, సమాజంలో సర్దుకుపోవాలనే కాంక్ష వున్నంత కాలం అతడు మర్యాద పరుడు. కానీ ఆ పద్ధతికి వేరైన ఆసక్తి కలిగిందంటే నీవు ప్రమాదకరమని భావిస్తారు. అందుకని నీకు పూర్తి అభిలాష, ఆసక్తి కలగకుండా చేస్తుంది సమాజం. నీ ఆసక్తి నీ ఉనికి పూర్తిగా ప్రకటిస్తుంది. కనుక అది విప్లవాత్మకమైన చర్యకు కారణం అవుతుంది. (TMOC-121)

## మంచి మనిషి మంచి పౌరుడు

తెలివివున్నవాడు మంచి సమాజాన్ని సృష్టిస్తాడు. కాని మంచి పౌరుడు మంచి తెలివిగల వాడిని తయారుచేసే సమాజాన్ని సృష్టించలేడు. పౌరుడు ఆధిపత్యం వహిస్తే పౌరుడికి, మనిషికి మధ్య ఘర్షణ తప్పదు. మనిషిని బుద్ధిపూర్వకంగా అగౌరవించే సమాజం నాశనమయిపోతుంది. మానవుని మానసిక విధానం అర్థమైనపుడు పౌరులకు మనిషికి మధ్య సమన్వయం కుదురుతుంది. దేశం కానీ సమాజం కానీ అంతర్గత మానవుని పట్టించుకోదు. బహిర్గత మానవుని అనగా పౌరుని మాత్రమే పట్టించుకుంటుంది. అంతర్గత మానవుని అది కాదనవచ్చును. కానీ బహిర్గత మానవుని అంతర్గత మానవుడు అధిగమిస్తాడు. పౌరునికై యుక్తిగా ఏర్పాటుచేసిన పథకాలన్నీ అంతర్గత మానవుడు పాడుచేస్తాడు. భవిష్యత్తు నిమిత్తం దేశం వర్తమానాన్ని త్యాగం చేస్తుంది. భవిష్యత్తు గూర్చి తనకు తాను భద్రత వహిస్తూ వుంటుంది. ప్రస్తుతం గాక భవిష్యత్తే పరమావధిగా, మనిషిని గౌరవిస్తుంది. తెలివిగలవానికి ప్రస్తుతం, వర్తమానం, ఇప్పుడనేదే అతిముఖ్యం, రేపు కాదు. రేపనేది వాడిపోతేగాని (నేడు) వున్న దేమిటో అర్థంకాదు. వున్న దాని యొక్క అవగాహన వర్తమానంలో పరి

ణామం తెస్తుంది. ఈ పరిణామం అత్యంత ప్రాముఖ్యమైంది. మనిషితో పౌరుని సమన్వయ పరచడం ముఖ్యం కాదు. ఈ పరిణామం సంభవించినపుడు మనిషికి పౌరునికి మధ్య వుండే ఘర్షణ తొలగిపోతుంది. (COL I-51)

## సాధన చెడుదైతే, ఫలితం మంచిది కాదు

ఘర్షణలతో, గందరగోళంతో, దుఃఖంతో కూడిన సమాజ నిర్మాణానికి తోడ్పడి, ఇప్పుడు పూర్తిగాడిపైన సమాజాన్ని తయారుచేయాలని కోరుతున్నారు. ఈ స్థితికి సమాజాన్ని తెచ్చినవాడు. మనమ్యే కాగా మనలో ఎవరైనా తప్పు లెరుగని సమాజాన్ని తయారు చేయగలరో, హింస ద్వారా శాంతి లభిస్తుందని నమ్మడం భవిష్యత్ ఆదర్శానికి వర్తమానాన్ని త్యాగం చేయడమే అవుతుంది. చెడ్డ సాధన ద్వారా మంచి ఫలితాన్ని సాధించడమనేదే ప్రస్తుత వినాశనానికి కారణం. (ESL)

## స్వేచ్ఛ ఎవరికుంటుంది

నేను ఈర్ష్యాపరుణ్ణి, లోభిని అయినంత కాలం మానసికంగా సమాజంమీద ఆధారపడతాను. ఆ విధంగా సమాజం మీద ఆధారపడినంత కాలం స్వేచ్ఛలేదు. లోభిని కావడం ఆగిపోతే నేను స్వేచ్ఛ పొందినట్లే. (LH-59)

## మానవ సంబంధాలు ఘర్షణ

మరణంలో మాత్రమే నీవు ఒంటరివి, జీవించడంలో ఎల్లప్పుడూ సంబంధం వుంది. తండ్రితో, సోదరునితో, భిక్షగానితో, బాటసారితో, వ్యాపారితో, కలెక్టరుతో సంబంధం తప్పదు. ఆ సంబంధాన్ని సరిగా అర్థం చేసుకోక పోవడం వల్లనే ఘర్షణ వస్తుంది. సరిగ్గా అర్థం చేసుకుంటే ఘర్షణ లేదు. అపుడు ఒంటరిగా జీవించడమనేదే లేదు. (LH-60)

## స్వేచ్ఛ ఎలా ప్రాప్తిస్తుంది ?

అయితే స్వేచ్ఛగా వుండే సంబంధం నాకెలా వుంటుంది? భయం లేనపుడు వుండే సంబంధంలోనే స్వేచ్ఛ వుంది. కనుక మానసికంగా ఆధారపడడమే భయాన్ని పోషిస్తుంది. ఈ ఆధారపడడం నుండి స్వేచ్ఛ పొందాలి. (LH-60)

## నవీన సమాజ సృష్టి

తప్పకుండా కొత్తసమాజాన్ని సృష్టించాలి. అంటే నీవు వ్యక్తిగా అర్జనం, ఈర్ష్య, లోభత్వం నుంచి విడుదల పొందాలి. జాతీయత, దేశభక్తి, సంకుచిత పరిచేమతాలోచన నుండి స్వేచ్ఛ పొందాలి. అప్పుడు మాత్రమే కొత్త సమాజాన్ని, పూర్తిగా కొత్త సమాజాన్ని సృష్టించగలవు. అలా కాకుండా, ఆలోచనారహితంగా

ప్రస్తుత సమాజంలో సర్దుకుపోదామని ఆరాటపడుతుంటే కేవలం పాత పద్ధతుల్ని అనుసరిస్తున్నట్లే అంటే ఈర్ష్య, అధికారం, అభిమానం, (పరువు ప్రతిష్ట) నమ్మకాలలో కూరుకుపోయినట్లే-అవన్నీ అవినీతికరమైనవి. (LH-131)

## మనిషి మారితే నవీన సమాజం

ఇప్పుడు ఐరోపాలో, ఇండియాలో, ఇతరచోట్ల వున్న అవినీతికరమైన సమాజంలో సంఘ నిర్మాణంలో మౌలికమైన మార్పులు రావాలి. నిర్మాణమెంత బందోబస్తుగా వున్నా, మనిషి తనలో తాను అవినీతిగా వుంటే, తన చర్యల్లో అవినీతిగా వుంటే అతడు దాన్ని అతిక్రమిస్తాడు. అందుకని అతడు తప్పనిసరిగా మారవలసిన అవసరం కనపడుతుంది. (TAOI-59)

## సుఖం మనిషికి లభిస్తేనే నవీన సమాజం

సుఖంగా వుండే మానవుడే కొత్త సమాజాన్ని తేగలడు. అయితే సిద్ధాంతంలోను, నమ్మకంలోను ముడిపడ్డవాడు కాడు, సుఖవంతుడు. ఏదో సామాజికమైన వ్యక్తిగతమైన క్రియాకలాపంలో తగుల్కొన్నవాడూ సుఖవంతుడు కాడు. సుఖమనేది దానికదే చివరిది కాదు. వున్నదాన్ని అర్థం చేసుకోవడంలోనే అది లభిస్తుంది. తన ప్రతిబింబాల నుండి మనస్సు విముక్తి నొందినప్పుడు మాత్రమే సౌఖ్యం వుండగలదు. ఆలోచించుకున్న సౌఖ్యం కేవలం ఆత్మతృప్తికే. క్రియద్వారా, అధికారం ద్వారా వచ్చే సౌఖ్యం ఇంద్రియోద్రేకానికి సంబంధించింది. ఆ వుద్రేకం చల్లారిపోతుంటుంది. కనుక ఇంకా కావాలి, ఇంకా కావాలనే పెరపెర లెక్కువౌతాయి. ఘర్షణ, దుఃఖం వున్నంత కాలం సౌఖ్యంలేదు. సౌఖ్యం స్మృతికి సంబంధించింది కాదు. అది సత్యంతో వుండేటప్పుడు వచ్చే స్థితి, నిత్యనూతనమైనది. సతతం కొనసాగేది కాదు. (COL-II-70)

## ప్రపంచం అంటే మనమే

మనమంతా కలిస్తే ప్రపంచం. అలా భావించడం, అలా సంబంధం పెట్టుకోవడం, ఇంకా ఇతరత్రా సంబంధం లేకపోవడం ఒక గొప్ప బాధ్యతతో కూడిన ఫీలింగ్ ఇస్తుంది. విభజనాత్మకం కాబట్టి సంపూర్ణమైన క్రియకు పురికొల్పుతుంది. (TAOI-75)

## మనుషుల మధ్య సంబంధాలు

సంబంధం అనేది ఏదో క్రియలోనో, ఒక ప్రాజెక్టులోనో, సిద్ధాంతంలోనో కాకుండా సంపూర్తిగా కలసిపోవడమవుతుంది. అంటే ఏ స్థాయిలోకూడా ఏ విధంగా కూడా మనుష్యుల మధ్య విభాగం కాని, ముక్కలు ముక్కలు కావడం కాని వుండదు. (TAOI-76)

## సంబంధం లేకపోతేనే అవినీతి

అవగాహనతో కూడిన సంబంధం లేకపోతే ప్రపంచంలో సిద్ధాంత రీత్యా సాంకేతికపరంగా క్రమతను సృష్టించాలని చేసే ప్రయత్నం మనిషికి మనిషికి మధ్య అగాధాన్ని కలుగజేస్తుంది· అవినీతిని నిరోధించలేదు. సంబంధం లేకపోవడం వల్లనే అవినీతి మొదలవుతుంది. అదే అవినీతికి కారణం అవుతుందని భావిస్తున్నా. (TAOI-76)

## ఎవరు నిజంగా వ్యక్తి ?

విభాగంగా వుండడమే ఈనాడు సంబంధం అయింది. ఇండివిడ్యువల్ అనే దాని మూలార్థం (INDIVIDUAL=INDIViSIBLE) (వ్యక్తి అంటే అవిభాజ్యమైనవాడు) తనలో తాను విభాగంగా వుండనివాడు, ముక్కలు ముక్కలు కానివాడు, నిజంగా అలాంటి మానవుడే వ్యక్తి. మనలో ఎక్కువ మంది వ్యక్తులం కాము. కానీ మనం వ్యక్తుల మనుకుంటాం. అందుకే వ్యక్తి సంఘానికి వ్యతిరేకంగా వుంటుంటాడు. ఆ పదానికి నిఘంటువు అర్థం తెలిసికోవడమేగాక విభాగం లేదనే లోతైన భావాన్ని గ్రహించాలి. అంటే మనస్సు, హృదయం, దేహం మధ్య సంపూర్ణమైన ఐక్యత వుండాలి. అపుడు మాత్రమే వ్యక్తిత్వం వుంటుంది· (TAOI-76)

## సమగ్ర జీవితంలోనే ప్రేమ

నిజమైందని అబద్ధమైందని జీవితాన్ని మనం విభజిస్తాం, నీకిష్టమైంది నిండు హృదయంతో చేయడం నిజమైన జీవితం అంటాం. అందులో అంతరాత్మ విభేదం లేదు. నీవు చేస్తున్న దానికి, నీవు చేయవలసిందానికి మధ్య యుద్ధం లేదు. అపుడు జీవితం సమగ్రమైన ప్రక్రియ అవుతుంది. అందులో అద్భుతమైన ఆనందం వుంది. మానసికంగా ఎవరి మీద ఏ సంఘం మీద ఆధారపడకుండా వుంటే లోన ఎలాంటి అనుబంధం లేకుండా వుంటే అది సంభవిస్తుంది. అపుడే నీవు చేసేదాన్ని ప్రేమించగలవు. అలా సంపూర్ణ విప్లవాత్మక స్థితిలో వుంటే నీవు తోటమాలివైనా ఫరవాలేదు. ప్రధానమంత్రివైనా ఫరవాలేదు. ఏమిచేసినా ఫరవాలేదు. నీవుచేసేదాన్నే ప్రేమిస్తావు. ఆ ప్రేమ నుండి అసాధారణమైన సృజనాత్మక భావం పరిఢవిల్లుతుంది. (TMOC-64)

ప్రశ్న : సరే, వున్న సంఘాన్ని వ్యతిరేకించి కొత్త సమాజాన్ని సృష్టిస్తే ఆ సృష్టించడం కూడా మరొక కోర్కె కాదా ?

## క్రొత్త సమాజానికి ఆధారం కోరిక కాదు

జవాబు : నేను చెప్పింది పూర్తిగా వినలేదేమో ననిపిస్తుంది. ప్రస్తుత సమాజ వాతావరణంలోనే మనస్సు వుంటూ సమాజానికి ఎదురు తిరిగితే అది జైలులో కుట్ర

లాంటిది. అది మరొక రూపంలో వుంటే ఆశయమవుతుంది. కానీ ఈ సమాజానికి సంబంధించిన వినాశక ప్రక్రియను మనస్సు పూర్తిగా అర్థం చేసుకొని, బయట పడితే అప్పుడు జరిగే క్రియ కోర్కెతో వుండదు, అలాంటి చర్య క్రొత్త సంస్కృతిని మెరుగైన సమాజాన్ని వేరైన ప్రపంచాన్ని సృష్టించవచ్చు. ఆ సృష్టితో మనస్సుకు సంబంధం లేదా ? దాని ఆసక్తి ఏమంటే నిజమైనదేమిటో కనుగొనడమే సత్యం యొక్క సంచలనమే క్రొత్త ప్రపంచాన్ని సృష్టిస్తుంది. ఆ సృష్టి చేసేది ఎదురు తిరిగిన మనస్సు కాదు. (TMOI-139)

## స్వార్థం అవినీతికి ఆశ్రయం

స్వార్థం అనే కేంద్రం ఘర్షణకు మూలస్థానం. అది అభిరుచులకు అత్యంత ప్రాధాన్యత ఇస్తుంది. ఆ కేంద్రమే మైలపట్టిన ఆత్మ. అది స్వల్పమైంది. దాని సంగతీ అంతే. దాన్ని ఆత్మయని అంతరాత్మయని పరమాత్మయని చక్కని శబ్దాలతో వర్ణించవచ్చు, ఆ వర్ణన అంతా అవినీతిని కప్పిపుచ్చడానికే. దాన్ని దాటి పోవడమెలా ? (BV-153)

## ఘర్షణ లేని జీవితంలోనే నీతి

ఘర్షణ అంటే అవినీతి. దానివల్ల శక్తి వృథా అవుతుంది. పుట్టింది మొదలు చచ్చే వరకు అది మన జీవిత పోరాటం. ఒక్క క్షణం కూడ ఘర్షణ లేకుండా జీవించడం సాధ్యమా? అది జరగాలంటే మనల్ని మనం తెలిసికోవాలి. మనంతకు మనం తెలిసికోవాలి. మన మొత్తం గమనాన్ని ఎలా పరిశీలించాలో తెలిసికోవాలి. అందుకే యదార్థమైన పరిశీలన వుంది. సమానుకూలమైన (Harmonious) పరిశీలన వుంది. అది కేవలం పరిశీలన మాత్రమే. పరిశీలించే వాడు వుండడు. అప్పుడే ఘర్షణలేని జీవితం వుంటుంది. (TAOI-79)

పోలిక పోల్చటం చేశామంటే ఘర్షణ, ఈర్ష్య,సాధించాలనే కోర్కె,అంతకు మించి పోవాలనే ఇచ్ఛ వచ్చి పడతాయి. (TAOI-80)

గుర్తుంచుకుంటేనే పోలిక వుంటుంది. పోలిక ఈర్ష్యను కలిగిస్తుంది. దాని మీదే సమాజం ఆధారపడింది. ఆ సమాజం సంపాదనకు ఎగబడేది. పోలిక ఎప్పుడూ అవగాహన ఇవ్వదు. అవగాహనలో ప్రేమ వుంది. పోలిక బుద్ధిపరమైంది. అది అనుకరించడం, అనుసరించడం, అనే మానసిక ప్రక్రియ అందులో నడిపేవాడూ, ప్రమాదభరితమే, నడిచేవాడు, ప్రమాదభరితమే ఆ ప్రమాదం చూస్తున్నారా? లేదా? (LH-101)

ఒక పద్ధతే సమాజం. అదే సంస్కృతి, లేక మీరనుకునే జ్ఞానం, పైకొచ్చిన వారెవరో దాన్ని కల్పించారు. దాని ప్రకారం ప్రతి ఒకరూ బ్రతకాలని

ప్రయత్నిస్తున్నారు. సొంత భావాలు, అభిప్రాయాలు అణచుకొని ఆ పద్ధతికి కట్టుబడి పోవాలనుకుంటున్నారు. అందులోనే ఘర్షణ వుంది. ఘర్షణ వల్ల ప్రధానంగా శక్తి వృధా అవుతుంది. (TAOI-474)

మనలో ఎక్కువ మందికి చాలా తక్కువ శక్తి వుంది. శక్తిని మనం ఘర్షణలో, పోరాటంలో ఖర్చు చేస్తాం. అనేక విధాలుగా వృధా చేస్తాం. లైంగికంగానే కాకుండా ఎక్కువ భాగం వైరుధ్యాలలో మనల్ని మనం విభజించుకోవడంలో వినియోగిస్తాం. దాన్ని వల్ల ఘర్షణ వస్తుంది. (BV-50)

## ఘర్షణ ఉంటే ధ్యానం లేదు

నిక్కచ్చిగా ఘర్షణ శక్తిని బాగా వృధా చేస్తుంది. శక్తి స్థాయిని తగ్గిస్తుంది. మనకు భౌతిక శక్తే గాక, మానసిక శక్తి కూడా చాలా అవసరం. అది స్పష్టంగానూ, తార్కికంగానూ, ఆరోగ్యంగానూ, అలజడి లేకుండానూ మనస్సు వల్ల లభిస్తుంది. ఎలాంటి సెంటిమెంట్లు వికారాలు లేనట్టి, ఎంతో ప్రేమ కరుణ వున్నట్టి హృదయం ద్వారా లభిస్తుంది. గొప్ప తీవ్రతను ఆసక్తిని కల్గిస్తుంది. లేకపోతే ధ్యానం అనే దానికి ప్రయాణం చేయలేము. పద్మాసనం వేసుకోవచ్చు, ప్రాణాయామం చేయవచ్చు, తమాషాలు జరపవచ్చు. కాని దాన్ని చేరలేము. (BV-50)

## ఘర్షణ లేని జీవితం

కోర్కెవల్ల, స్మృతివల్ల, భయంవల్ల, వినోదంవల్ల, బాధవల్ల క్రియ జరిగినంత కాలం ఘర్షణ గందరగోళం, వ్యతిరేకతలు వుంటాయి. మన నిబద్ధతను బట్టే మన క్రియ లుంటాయి. వాటివల్ల వచ్చే చాలెంజ్ ఎదుర్కోలేక శక్తి చాలక ఘర్షణలో పడతాం. అసలు సమస్య అది. ఆత్మ అనేది ఘర్షణతో నిర్మాణమైందే. ఘర్షణ అనగా లోభత్వానికి, భయానికి, విజయానికి సంబంధించినది. ఘర్షణ లేకుండా బ్రతకడం సాధ్యం. అది స్వానుభవం ద్వారా తెలియాల్సిందే. లేకపోతే వొట్టి సిద్ధాంతంగా మిగులుతుంది. కానీ వాస్తవం కాదు. ఆత్మపరమైన విధానాలు తెలిస్తే ఈర్ష్య లేకుండా వుండడానికి వీలవుతుంది. (COL I-123)

## ఘర్షణ

ఘర్షణకు మూలమేంటి? విభజనయే. దాని కారణమేంటి? దాని వెనకే ముంది? బహుశా జ్ఞానం. (TOWL-70)

తాత ముత్తాతలు సృష్టించిన ఈ సంస్కృతే మానవుల వునికికి కారణం. అదే దుఃఖాన్ని, ఘర్షణను, విభజనను తెచ్చిపెట్టింది. (TOW-PL-13)

మొదట మానసికంగా, తరువాత భౌతికంగా ముక్కలు చేసింది. (TOW-PL-15)

మానసికంగా జ్ఞానాన్ని వాడుతున్నా, నాకు బాగా తెలుసనుకుంటా. నాకు

నిజంగా తెలియదు ఎందుకంటే మార్పు చెందుతున్నా, చలిస్తున్నా, జ్ఞానాన్ని సంతృప్తికి, అధికారానికి, విజయానికి, ప్రపంచంలో గొప్పవాణ్ణి కావడానికి వాడుతున్నా. నేను గొప్ప పండితుడిని, వేల పుస్తకాలు చదివా. అది నాకు హోదా, గౌరవం, పీఠం ఇస్తుంది. మానసిక భద్రతను కోరినప్పుడు విభజన తెచ్చిపెడుతుంది. అదే భౌతిక భద్రతను కూడా పాడుచేస్తుంది. (TWOL-20)

ఇంజన్ (INTERNL COMBUSTION MACHINE) వుంది. అది ఎందుకు అరిగిపోతుంది? మన మెదడు కూడా అలాంటిదే. ఘర్షణలో, పోరాటంలో జీవిస్తాం. గందరగోళంలో వుంటాం. అపుడు మెదడు అరిగిపోతుంది. (Q. A-30-12-82)

ఘర్షణ వుండాల్సిందే, లేకపోతే పెరుగుదల వుండదని చాలామంది అంటారు. అది జీవితంలో ఒక భాగమంటారు. అడవిలో చెట్టు సూర్యుని చేరడానికి గింజుకుంటుంది. అది ఒక విధమైన ఘర్షణ. ప్రతి జంతువు ఘర్షణలో ఉంది. తెలివిగా ఉండవలసిన మనం, మానవులం నిరంతరం ఘర్షణలో ఉన్నాం. ఇపుడు అసంతృప్తిగా ఉన్న వాడేమంటాడు. నేనెందుకు ఘర్షణలో వుండాలి? ఘర్షణ అనేదాంట్లో పోల్చుకోవడం, అనుకరించడం, స్థిరీకరించడం సరిపెట్టుకోవడం, గతమే వర్తమానం ద్వారా భవిష్యత్తులోకి సాగడం-ఈ ప్రక్రియలన్నీ ఉన్నాయి. ఘర్షణ ఎంత తీవ్రంగా వుంటే అంత నరాల జాడ్యం (Neurotic) వస్తుంది. అందుకని ఘర్షణ నుండి పైతొలగడానికి మీరు దేవుణ్ణి గాఢంగా నమ్ముతారు. "అతని ఆజ్ఞ నెరవేరుగాక" అని అంటారు. ఈ రకాన లోకాన్ని సృష్టిస్తాము. (TWOL-179)

## సంఘర్షణ

గురువెవరో, ఋషి ఎవరో, నాయకుడెవరో తెలిసికోవడం ప్రధానం కాదు. ఎందుకు వాళ్ళని అనుసరిస్తున్నామో తెలిసికోవడం ముఖ్యం. ఏదో కావాలని, స్పష్టంగా వుండాలని మీకు మీరే అనుసరిస్తారు. గందరగోళం మనలో ఉంది, మనమే దాన్ని తెచ్చిపెట్టాం. దాన్ని తొలగించాలి. మనం తృప్తినిచ్చే హోదా కల్గియుండవచ్చు. అంతర్గత భద్రతను పొంది వుండవచ్చు. సంస్థాగత నమ్మకములో పెద్ద స్థానంలో వుండవచ్చు. కాని అదంతా ఘర్షణకు, దుఃఖానికి దారితీసే కార్యక్రమమే ఆత్మావృతమైందే. మీరు సాధించింది తాత్కాలికానందాన్నివ్వవచ్చు, మీకు ఆ హోదా రాక తప్పదనుకోవచ్చు, ఆ కృషిలో వుండవచ్చు. అది మీకు పట్టిన వశ అని భావించవచ్చు. ఏ ఏస్థాయిల్లో ఎంత కాలమైతే మీరేదో కావాలనుకుంటారో అంత కాలం మీకు దుఃఖం, గందరగోళం తప్పవు. ఏమీ కాకుండా ఉండడం అంటే ప్రతిదీ కాదంటం కాదు. ఇచ్ఛకు సంబంధించి చేయాలని కానీ, చేయకూడదని కానీ కోర్కె

పెట్టుకుంటే అది పదునై పెద్దదై క్లేశానికి, ఘర్షణకు దారితీస్తుంది. అవగాహనకది మార్గం కాదు. అధికారాన్ని తెచ్చిపెట్టి దాన్ననుసరించడం అవగాహన కాదు. అవగాహన వున్నప్పుడు స్వేచ్ఛవుంది. అది కొనేది కాదు, ఎవరో ఇచ్చింది కాదు. కొన్నది పోతుంది, ఇతరులిచ్చింది తిరిగి తీసుకుంటారు. అదే విధముగా అధికారం దాని భయాలు పోషించబడ్డాయి. శాంతులతోను, కొవ్వొత్తులతోను భయం తొలగించలేం. ఏదో కావాలనే కోర్కె ఆగిపోతే కాని భయం పోదు. (COL I-66)

విడిగా వుండాలనే భావానికెందుకు అంటిపెట్టుకుంటాం? మన ఇంద్రియ జ్ఞానాలు వేరు, వాటి ద్వారా బ్రతుకుతుంటాం. మనమే ఉద్రేకాలు, సంతోషం గానీ దుఃఖంగానీ కలిగించే జ్ఞానాలు లేకపోతే మనం లేము. అవి మనకు చాలా ముఖ్యం. వాటిని వేరు వేరుగా గుర్తిస్తాం. ప్రయివేటు జీవితంలో, పౌర జీవితంలో వివిధ స్థాయిల్లో వేరు వేరు ఇంద్రియజ్ఞానములుంటాయి, అవి విరోధ పడ్డపుడు ఘర్షణ పుడుతుంది. ఏ జీవితంలో కానీ ఉద్రేకాలెప్పుడూ ఒక దాని కొకటి విరుద్ధంగా వుంటాయి. ఉద్రేకంలో ఘర్షణ అంతర్లీనంగా ఉంది. అధికారంతోగానీ, వినయంతోగానీ వుండాలని కృషిచేస్తే ఉద్రేకం, ఘర్షణలు తప్పవు. అవి వ్యక్తిగత జీవితంలోనూ, సామాజిక జీవితంలోను దుఃఖాన్ని తెచ్చిపెడతాయి. అధికంగా కానీ, అల్పంగా గానీ వుండాలనే నిరంతరం కోర్కె ప్రత్యేక వ్యక్తిగత భావానికి, ఏర్పాటుకు అవకాశం ఇస్తుంది. ఈ వాస్తవాన్ని గ్రహించ గల్గితే, దాన్ని ఖండించకుండా, సమర్థించకుండా వుండ కల్గితే ఇంద్రియజ్ఞానాలు మన జీవిత సర్వస్వం కాదని కనిపెట్టగలం. అపుడు ఇంద్రియ జ్ఞానం యొక్క స్మృతిరూపమైన మనస్సు ప్రశాంతంగా వుంటుంది. ఘర్షణలతో అది చీలికలు, పేలికలు కాదా? మనస్సు మౌనంగా, ప్రసన్నంగా వున్నప్పుడు "నేను నాది" అనేది లేకుండా ప్రేమించగల్గుతుంది. ఈ ప్రేమలేని సామూహిక చర్య కేవలం వత్తిడి అవుతుంది. వ్యతిరేకతను, భయాన్ని పోషిస్తుంది. అంచేత వ్యక్తిగత సామాజిక ఘర్షణలు తెచ్చిపెడుతుంది.

## గందరగోళం

మనకు అర్థంగాని దాన్ని అడ్డుకుంటాము. గందరగోళం, దోషం, దుఃఖం యొక్క స్వరూపం, విధానం తెలియక వాటిని ఎదుర్కొంటాం. గందరగోళం యొక్క స్వరూపం, నిర్మాణం తెలియక దాన్ని ఎదిరిస్తుంటాం. దాన్ని ఎందుకు తెలిసికోరు? (COL I-148)

ఒకరి భావం ఒకరికి తెలిసినపుడే ఇద్దరి మధ్యన అవగాహన భయం వుంటుంది. ఒకరినొకరు అడ్డుకుంటుంటే అవగాహన వుండదు. భయం లేనప్పుడే భావైక్యత, సంబంధం వుంటుంది. (COL I-148)

## భయం

ఏదో సంబంధంతోనే కదా భయం వుండేది; భయం విడిగా, తనంతటతాను

వుండదు, కేవలం (ABSTRACT) వస్తు సంబంధం లేకుండా భయం వుండదు. తెలిసిన దానివల్లో, తెలియని దానివల్లో, భయం ఉంటుంది. చేసినదానివల్లో, చేయ వచ్చనేదానివల్లో, భయం ఉంటుంది. గతంలో, భవిష్యత్తులో, భయం ఉంటుంది. యదార్థంగా ఉన్న స్థితికి మరోవిధంగా వుండాలనే స్థితికి మధ్యగల సంబంధం భయాన్ని కల్గిస్తుంది. ఉన్న స్థితిని బహుమతి, శిక్ష అనే పదాలలో వ్యాఖ్యానించ డంలో భయం వుంది. బాధ్యతలోను దానినుండి తప్పించుకోవాలనుకోవడంలోను భయం వుంది. బాధ, వినోదం మధ్య భయం ఉంది. వ్యతిరేకమైన వాటి ఘర్షణలో భయం ఉంది. విజయాన్ని పూజించడంలో అపజయం వస్తుందనే భయం ఉంది. ఏదో కావాలనుకోవడంలో ఉన్న పోరాటానికి సంబంధించిన మానసిక విధానంలో భయం ఉంది. మంచిగా ఉండాలనుకోవడంలో తక్కువైపోతామేనన్న భయం ఉంది. పోల్చుకోవడం అవగాహన కాదు. తెలిసిన దాంతో తెలియని దానికి ముడి పెడితే భయం ఏర్పడుతుంది· ఆ భయం పోలిక తెచ్చిపెడుతుంది. భద్రతను వెదకడంలో భయం ఉంది; అనిశ్చయత ఉంది.

## ఘర్షణ — విజయ కాంక్ష

మన పిల్లలు అధికారంలో ఉండాలనుకొన్నంత కాలం, పెద్దపెద్ద, ఉన్నతమైన పదవులు పొందాలనుకున్నంత కాలం, ఇంకా ఇంకా విజయవంతం కావాలనుకుంత కాలం మన హృదయాల్లో ప్రేమలేదు. విజయాన్ని ఆరాధించడం ఘర్షణ, దుఃఖం కొనితెచ్చుకోవడమే. ప్రేమించడమంటే పిల్లలతో హృదయ పూర్వకంగా సంసర్గం చెందడం. స్పందనకు, తెలివికి, సమగ్రతకు సహాయపడే విద్య పిల్లలు పొందేట్లు చూడాలి. (ESOL-)

## ఘర్షణ—నిత్యజీవనం

మీ రోజువారీ జీవితం క్రమత లేకుండా, గందరగోళంగా, వైరుధ్యంగా ఉంటే లోదృష్టి రాదు. అది బాగా తెలిసిందే. (THOL-237)

## ఘర్షణ—అంతర్గతం

మీలో అలజడిని తీర్చగలిగితే, అప్పుడు జీవితోద్దేశమేమిటో తెలుస్తుంది. నీవు అడగనక్కరలేదు. దానికై ఎదురు చూడనవసరం లేదు. గందరగోళం నుండి తొలగాలంటే దాని కారణాలు తెలిసికోవాలి. అవి చాలా స్పష్టం. అవన్నీ "నేను" అనేదానిలో మూలభూతమై ఉన్నాయి. అది అర్జవం ద్వారా, ఏదో కావడం ద్వారా, విజయం ద్వారా, అనుకరణ ద్వారా, నిరంతం వ్యాపించాలని కోరుతుంది. దాని లక్షణాలు ఈర్ష్య, అసూయ, లోభత్వం, భయం. ఈ అంతర్గత గందరగోళ మున్నంతవరకు బహిర్గత సమాధానాలు వెదుకుతుంటారు. కాని అంతర్గత అలజడి తొలగించుకుంటే జీవిత ప్రాధాన్యత యేమిటో తెలుస్తుంది. (LH-125)

# అహం – ఆత్మ

## "నేను", ఆత్మ వేర్వేరా?

"నేను, నాది". ఇవి వ్యక్తిభావాలు, అవి గుర్తించడానికి అవసరం. ఇవి ఒక విధంగా సార్థకాలు, అర్థరహితాలు కూడా. అయితే వ్యవహారానికి అవసరం. నా చేయి, నా శరీరం, నా చిత్తం, నా ఆత్మ, నా దేవుడు, అనటంతో "నేను" వేరు నా చేయి వగైరా వేరు అని విడదీస్తాం అనిపిస్తుంది. "నేను" ను వేరుచేసి ఇది శాశ్వతం, సత్యం సర్వాత్మ అంటూ వివరిస్తాం. "నా ఆత్మ" అన్నపుడు "నేను", ఆత్మ వేరైనట్లేనా? "నేను" కు "ఆత్మ"కు తేడా ఏమిటి?

## నేను ఆత్మనా ?

"అహం బ్రహ్మాస్మి" "అయ మాత్మా బ్రహ్మ" అన్న వాక్యాలున్నాయి. నేనే బ్రహ్మను, ఈ ఆత్మయే బ్రహ్మ-నేనే ఆత్మను, బ్రహ్మంను అని వీటి అభిప్రాయం. అయితే "నేను" అన్నిటికి వేరైనదా లేక అన్నీ అదేనా?

## స్వయంగా తెలుసుకోవాలి

"నేను" "ఆత్మ" అనే వాటికి కొన్ని నిశ్చిత అభిప్రాయాలున్నాయి. వాటి వాస్తవాలేమిటి? స్వయంగా తెలిసికోవాలంటే ప్రశ్నించాలి. ఇతరుల అభిప్రాయాలు, శాస్త్ర వాక్యాలు, నిర్ణయాలు ప్రక్కన పెట్టాలి. ముందుగానే వాటికి రంగులు పులమరాదు. తెలిసికోడానికి ప్రయత్నిద్దాం, పరిశీలిద్దాం. ఎవరికి వారు, ఒకరితో ఒకరు కలసి నిశితంగా సంభాషించుకుంటే కొంత అవగాహన కుదురుతుంది.

## 'నేను' దాని సముదాం

నేను అన్నప్పుడు తన ఉనికి, మొత్తం కదా! అంటే దేహం, మనస్సు, విశ్వాసాలు, అభిప్రాయాలు, సంబంధాలు-అన్నీ కలసి "నేను", అంతేగాకక్షేడంబాన్ని, దర్పాన్ని, ధీమాని, జయాన్ని, సంపాదనల్ని అది వ్యక్తం చేస్తుంది. కనుక అది "అహం" భావానికి ప్రతిరూపం.

మరైతే "నేను" పుట్టుకనుండి చావు వరకు వుండేదా? లేక మధ్యలో తయారయ్యేదా? లేక జనన మరణాలతో సంబంధం లేకుండా వుండేదా? మానసికమైనదా? భౌతికమైనదా?

## ఆత్మ

దైవాన్ని, దైవశక్తిని "ఆత్మ" అని, "పరమాత్మ" అని పేర్కొంటుంటారు. అంటే అతీతశక్తి "ఆత్మ" రూపమైందని అంటారు. బ్రహ్మ, పరబ్రహ్మ ఆత్మకు పర్యాయ పదాలు. "నేను" "I" అని, "ME" అని, "SELF" అని "EGO" అని ఇంగ్లీషులో వాడతారు. "ఆత్మ" SOUI అని, "SPIRIT"అని వాడతారు.

## ఆత్మ ఉందా? లేదా ?

ఆత్మ వుందని లేదని వాదోపవాదాలు, విభిన్న అభిప్రాయాలున్నాయి. కొన్ని మతాలు ఆత్మ వుందని, కొన్ని లేదని నమ్ముతాయి. బుద్ధుడు లేదని భావించాడు. సోక్రటీసు వుందని విశ్వసించాడు. "ఆత్మ వత్సర్వ భూతానిహృద్దేశోర్జున తిష్ఠతి" అని భగవద్గీత చెప్తుంది.

## ఆత్మ విచారణ అవసరమా ?

గుండె వేరు, "హృదయం" వేరు. "ఆత్మ" వేరు, హృదయంలో ఆత్మ వుందని కూడ అంటారు. హృద్దేశం హృదయ దేశం అన్నప్పుడు హృదయం దేశానికి సంబంధించిందని అర్థం. దేశం అంటే ప్రదేశం, చోటు, ఖాళీ, Space: ఇది మానసికమైనదా? మనస్సు, హృదయం ఒకటేనా? మనస్సు, ఆత్మ ఒకటేనా? లేక మనిషి పెరుగుతూ ఆత్మను కల్పించుకుంటాడా? ఆత్మ మొదటి నుంచి వుండేది కాదా? అనంత శక్తి, ఆత్మ ఒకటేనా? ఇలాంటి ప్రశ్నలన్నింటికి స్పష్టమైన సమాధానాలు లభించాలి. లేకపోతే ఇదొక గందరగోళం అవుతుంది. ఘర్షణకు కారణం అవుతుంది. లేదా ఆత్మను గూర్చి ఏ అభిప్రాయం లేకుండా వుండడం మంచిది. అయినా ఆత్మ జీవితానికి ఎంతవరకు సంబంధించింది? దాని ప్రస్తావన లేకుండా మనిషి బ్రతకలేడా?

ఈ అహం, ఆత్మలను గూర్చి కృష్ణాజీ అవగాహనా దర్పణంలో చూద్దాం.

జె.శ్రీ.

.... ....

చీకటి యందైనను తడుముకుంటూ కాంతివైపుకు కదలవలయునేగాని నీవద్దకు ఎవరూ వెలుగును కొనిరారు.

.... ....

నేను సమాజమును విడిచియుండలేదు. సమాజము నుండియే ఆనందమును ప్రకాశమును పొందితిని. (విశ్వసమాజమును వదులుట బాధ్యతారహితమగును.)

# అహం-ఆత్మ (SELF (AND SOUL)

## అహం

### తనను తానెరుగుట

తనను తాను తెలిసికోవడమెలా? తాను అనేది క్లిష్టమైన నిర్మాణం. క్లిష్టమైన చలనం. తన్ను తాను మోసం చేసికోకుండా తెలిసికోవడమెలా? ఇతరులతో వుండే సంబంధాన్ని బట్టి తన్ను తాను తెలిసికోవాలి. గాయం తగుల్తుందేమోనని దూరంగా వుండవచ్చు, సంబంధం ఉన్నప్పుడు దాని ద్వారా ఎంతో ఈర్ష్యగా, పరాధీనంగా, బంధంగా, నిర్లక్ష్యంగా వుండడం గ్రహించగలరు. తన్ను తాను తెలిసికోవడానికి "పరస్పర సంబంధం" అద్దంలా పనిచేస్తుంది. బయట సంబంధం కూడా అంతే. లోని తన ప్రతిబింబమే బయట కనబడుతుంది. ఎందుకంటే మౌలికంగా తనకు లాగానే సమాజం, ప్రభుత్వం-అన్నీ మానవులు సృష్టించారు.

(WL-215)

### నేను అసలు స్వరూపం

నేను ఇది చేశాను, నేను అది చేశాను, అన్నిటిలో నేను ప్రధానం-అనే అహం భావనలో స్వాభావికంగా "గర్వం" బీజరూపంలో వుంది. కనుక విజయంతో పాటు గర్వం పెరుగుతుంది. ఇతరులతో పోల్చుకున్నప్పుడు తాను చాలా ముఖ్యమనే డాంబిక భావం వుంటుంది. ఉదాహరణలు, ఆదర్శాలు, అనుసరించడానికి కృషి చేస్తున్నపుడు ఇతరులతో పోల్చుకోవడం వుంటుంది. పోలిక ఆశను, బలాన్ని, ఉద్దేశాన్ని, సంచలనాన్ని, కలిగిస్తుంది. అవి "నేను" ను బలపరుస్తాయి. ఇతరుల కన్న నేను ఉన్నతం అనే ఉల్లాసభావనే నేను. ఆ భావన, ఆ వినోద భావన గర్వానికి ఆరంభం.

(LA-87)

### నేను-విభాగం

అహానికి, నేను అనుదానికి కేంద్రమైవున్నంత కాలం మనస్సు కాలాతీతమైన దాన్ని కనుగొనలేదు. ఎందుకంటే అది ఎల్లప్పుడూ "ఇంకా" కావాలని కోరుతూనే వుంటుంది.

(చివరి వాక్యం (LA-141)

నేను-నేను కాని దానికి మధ్య విభాగం వచ్చినపుడు ఘర్షణ వుంటుంది. అది స్వానుభవంలో గ్రహించగలిగితే ఆలోచనా పరునికి, ఆలోచనకు మధ్య విభజన వుండదు. అపుడు 'ఉన్నదేదో' వాస్తవంగా గ్రహించవీలవుతుంది. ఉన్నదాన్ని వాస్తవంగా చూచేసరికి అసరికే నీవు దాన్ని దాటి వుంటావు పరిశీలించేవాడు వేరుగాను, "ఉన్నట్టిది" వేరుగాను ఉన్నంతకాలం ఉన్నదేమిటో చూడలేవు. ఈ

విభాగం పోగానే 'ఉన్నదేదో' ఉన్నదిగా వుండదు. మనసు దాన్ని అధిగమించి పోతుంది. (AI-69 కొంత)

## నేను-మనస్సు

పరస్పర సంబంధంలోనే తన్ను తాను తెలిసికో వీలవుతుంది. సంబంధంలో స్పందన, ప్రతిక్రియల ద్వారా తన్నుతాను చూసుకోవాలి. ఒంటరై పోవడమంటూ లేదు. తనకు గాయం తగల కుండ, అసౌకర్యం కలగకుండ, అసౌఖ్యం లేకుండ, బాధ లేకుండ మనస్సు తన్ను తాను ప్రత్యేకించుకుంటూ వుంటుంది. స్వార్థక్రియా కలాపాలలో పడి దూరమైపోతూ వుంటుంది. ఈ దూరమై పోవడంలో అనగా మనో గమనంలో నన్ను నేను తెలిసికోవాలను కుంటున్నాను. నాలో ఉన్నవి-భావాలు, ఆలోచనలు, ఉద్దేశాలు బహిర్గతమైనా, కాకపోయినా అన్నీ స్పష్టంగా గమనిస్తూ తెలిసికోవాలని వుంది. ఎలా సాధ్యం? "నిన్ను నీవు తెలుసుకో" అని గ్రీకులు, హిందువులు, బౌద్ధులు చెప్పారు. అతికష్టమైన వాటిలో ఇది ఒకటనిపిస్తుంది. మనల్ని మనం చూసుకోవటమెలా? కనుక్కుందాం. నిన్ను నీవు తెలిసికుంటే కల్పన యావత్తు ఎగిరిపోతుంది. అప్పుడు ఒక విశిష్ట గుణం ఏర్పడుతుంది. కాబట్టి తన్ను తాను తెలిసికోవడానికి పరిశీలించడ మంటే ఏమిటో అవగాహన చేసికోవాలి.

(A I-475)

## ప్రజ్ఞ

"నేను" అనేది చిత్తులమారి తనానికి మూలమని మనస్సు గ్రహిస్తుందా? 'మనస్సు'కు బదులుగా 'ప్రజ్ఞ' అనే పదం వాడవచ్చు. అది హింస యొక్క పూర్తి చిత్రాన్ని చూస్తుంది, పరిశీలిస్తుంది. అందులో వున్న చిక్కుల నన్నింటినీ చూస్తుంది. "నేను "అనేది అన్నిటికీ మూలం." అని అప్పుడంటుంది. "నేను" లేకుండ జీవించడం సాధ్యమా? (A I-503)

## మనస్సు వేరు - నేను వేరు

ఈ మనస్సు "నేను" అనే దానికంటే వేరైనది. ఎందుకంటే ఈ మనస్సు పరిశీలిస్తుంది. "నేను" చూస్తుంది కాని, తొలగడానికి భయపడుతుంది. రెండు వేరు వేరు పరిశీలనలు – "నేను" చూడడం; "చూడడం" నేను భయపడుతుంది. అందుకే అడ్డుకుంటుంది. "నేనెలా బ్రతకడం"? "నేనేమి చేయాలి? దీన్ని వదలి పెట్టాలా? దీన్ని పట్టుకోవాలా"? అంటుంది. "నేను" కు సంబంధించిన ఏ గమనమైనా హింసే-అని మేమంటాం. చిత్రాన్ని కేవలం చూడడమంటూ ఒకటుంది. అది పూర్తిగా వేరైనట్టిది, స్పష్టపడింది కదా! మరి మీరేం చేస్తున్నారు. దిశ లేకుండా ఉద్దేశం లేకుండా కేవలం చూడడం ఒకటి. ఉద్దేశంతో, నడకతో

డైరెక్షన్‌తో, నిరోధంతో "నేను"- చూడడం మరొకటి. "నేను" చూస్తుంది. కాని ఏమైనా చేయడానికి భయపడుతుంది. (A I-504)

## కేవలం చూడడం

ఇది మీకు చూపిస్తున్నా. మీరిపుడు చేయండి- "నేను" తో చూడడం. "నేను" లేకుండా చూడడం "కేవలం చూస్తున్నా" అంటుంది మనస్సు.

ఇది సరళమే. మీకు పచ్చ చొక్కా వుంది. "నాకిష్టం, నాకిష్టం లేదు" అనను, కేవలం చూస్తా. "నాకు ఇష్టం" అని ఎప్పుడన్నానో అప్పటికే "నేను" ఉంటుంది. అదిఅలా అంటుంది.దాన్ననుసరించి మిగతావి వుంటాయి. కనీసం శబ్దార్థం స్పష్టమైందనుకుంటా. (A I-505)

"నేను" యొక్క నిర్మాణమే హింసాత్మకం. నేను జీవించే విధానమే ఆ నిర్మాణం. అదంతా కాలంలో జరుగుతుంది. కేవలం చూడడంలో కాలం లేదు. కాలంతో చూచిన తోడనే భయం వుంటుంది. (A I-506)

## పర సహాయం

ఎంత గొప్ప వారైనా ఇతరుల్ని అనుసరించడం వల్ల అహం యొక్క పోకడలు తెలియవు. వాటిని కనిపెట్టడాన్ని అనుసరణ ఆపి వేస్తుంది. సిద్ధంగా వుంటుంది. ఊహాత్మక (UTOPIA) వాగ్దానం. దాని వెంటబడడం సుఖానికి, అధికారానికి పరసహాయాన్ని కాంక్షించే చాటు, మాటు క్రియ జరుగుతున్నట్లు తెలియనివ్వదు. బోధకుడు, రాజకీయవాది, లాయరు, సైనికుడు అందరూ మనకు సాయం చేయడానికి వున్నారు. అలాంటి సహాయం తెలివిని, స్వేచ్ఛను హరిస్తుంది. మనం కోరే సహాయం మన బయట వుండదు. సహాయానికి మనం అర్థించనవసరం లేదు. మనం అంకితమైన క్రియలో వినయంగా వుంటే, మనకు నిత్యం వుండే విచారణల ప్రమాదాల అవగాహనకు మనస్సు తెరచి వుంచితే మనం అడక్కుండానే సహాయం లభిస్తుంది. (ESL)

## అహం - స్వరూపం

సంకల్పం లేకుండా లోదృష్టి, క్రియ ఉన్నప్పుడు "అహం" యొక్క కేంద్రం పనిచేయదు. లోపలుండే దాన్ని ఆత్మ, నాది, నేను, అహం, లిబిడో (Libido), పరిశీలకుడు, కత్తిరించేవాడు, అదుపు చేసేవాడు, ఆలోచించేవాడు, అనుభవించేవాడు - ఏమైనా అనండి అది మొత్తంగా ఆగి పోతుంది. మానసిక అభిప్రాయీకరణ అంతా కూడా అహమే. సవాలు వచ్చినప్పుడు, అహం అనే కేంద్రం నుంచి ప్రతిస్పందించేది గతమే. తక్షణ దర్శనంలో (Instant seeing), తక్షణ చర్యలో (Instant Acting) "అహం" ఏ మాత్రం ప్రవేశించదు.

స్పష్టంగా చూసి పనిచేయడంలో విభజన లేదు. అది పుస్తకాల నుండి రాదు. స్వయంగా తెలిసికోవడం వల్ల, సరాసరి గ్రహించడం వల్ల వస్తుంది. మరొకరి ద్వారా వచ్చేది కాదు. (BV-155)

## అభిప్రాయం - అహం

వాస్తవం నెట్టివేస్తాం, అభిప్రాయం పట్టుకుంటాం. అభిప్రాయం స్వాంతనోదయం, స్వీయకల్పనం, ఒక విధమైన ఆత్మపూజ, ఆత్మ కొనసాగింపు, కనుక తృప్తి కల్గిస్తుంది. అభిప్రాయం అధికారాన్ని, ఆధిపత్యాన్ని, స్థిరత్వాన్ని, మార్గాన్ని, రూపాన్ని ఇస్తుంది. "నేను" వదలదు, "నేను" చావదు. అభిప్రాయం లేక విధానం ఆత్మను - నేనును - పెంచుతుంది. ఇది కూడ ప్రేమ అనుకున్నాం. అందుకే కుమారుని, భర్తను ప్రేమిస్తాం. అది కావాలి. ఇది కావాలి అని కోరతాం.

(CL I-86)

## అహం - దేవుడు

ఆత్మ (అహం) వ్యక్తం కావాలను కోవడం ప్రతి మతం, సమాజం, సంస్కృతిలోనూ వుంది. కళలో ఆత్మ వ్యక్తం కావడం గొప్ప ప్రాముఖ్యమైంది. ఆధిపత్యానికి కూడ అది అవసరమైంది. ప్రతి మతం అహాన్ని అణచాలని చూస్తుంది. అహం గూర్చి అలజడి వద్దని దాని స్థానంలో దేవుణ్ణి లేక దేశాన్ని పెట్టడం జరిగింది. అదీ పని చేయులేరు. అహం దేవుడితో కూడ సాయుజ్యమైంది. ఏమైనా అహం మాత్రం మిగిలి పోయింది. మనమనేదేమిటంటే పనిచేస్తుండగా దాన్ని పరిశీలించు, దాన్ని గూర్చి నేర్చుకో, గమనించు, ఎరుక వహించు. దాన్ని నాశనం చెయ్యొద్దు వీన్ని వదలించుకోవాలి. లేక మార్పు చేయాలి అని అనవద్దు. గమనించు వికల్పం వద్దు, వక్రీకరించొద్దు ఆ గమనిక నుండి నేర్వడం నుండి అహం తొలగిపోతుంది. (BV-175)

## 'నేను' లేక పోతే అందం

అదే జరిగింది; ఆ గొప్పపర్వతం అల్పమైన, స్వల్పమైన "అహం" ను తరిమి వేసింది. ఈ క్షణంలో ఈ సంగతి గ్రహింప వచ్చు "నేను" పూర్తిగా తొలగితే అందం వుంది. అప్పుడు ప్రకృతిలో మానవునికున్న సంబంధం పూర్తిగా మారి

పోతుంది. ఈ నేల విలువ గలది అవుతుంది. ప్రతి చెట్టు, ప్రతి ఆకు, ప్రతిదీ ఆ సౌందర్యంలో భాగమే. కాని మానవుడు దాన్ని నాశనం చేస్తున్నాడు. (WL-197)

## నేను - నాది తొలగితే

ఎలాంటి ఆధిపత్యం లేకుండా విద్యార్థి నిర్భయంగా వుండడానికి సాయపడాలి. అప్పుడు వ్యక్తి ప్రేమలో, మంచిలో వికసిస్తాడు. ఇలా సహాయం చేయడంలో విద్య గరిపే వాడు కూడ తన విలువలు మార్చుకుంటాడు. "నేను" "నాది" అనే వాటినుండి తాను కూడ తొలగడం మొదలు పెడతాడు. ప్రేమలో, మంచిలో వెలుగొందుతాడు. పరస్పర విద్య అధ్యాపకునికి, విద్యార్థికి మధ్య పూర్తిగా వేరైన సంబంధాన్ని సృష్టిస్తుంది.

## 'నేను' లేని స్థితి

గత స్మృతిలో వున్నంత సేపు "నేను" వుంటుంది. వర్తమాన చైతన్యంలో (Living Thing) అనుభూతి చెందుచున్నప్పుడు "నేను" వుండదు. మనస్సు సరళంగా, వెదక కుండా, అడగ కుండా, అంటి పెట్టుకోకుండా, స్వేచ్ఛగా వుంటుంది. (సారాంశం : CL II-175)

## ఎరుకలో అహం లేదు

"అహం" అనేది అసలు సమస్య. దాన్ని ఆలోచన తీర్చలేదు. ఆలోచనకు సంబంధం లేని జాగృతి వుండాలి. అవును, కాదు అనకుండా ఎరుకతో వుండాలి. ఏదో సాధించాలనే జాగృతి వహిస్తే మాత్రం అది మళ్ళీ "అహం" ప్రక్రియే.

దేన్నైనా అర్థం చేసికోవాలనుకుంటే చూడడమే. ఆ చూడడంలో "నేను" వుండదు. ఆలోచన మొదలు పెడితే "నేను" వస్తుంది. చూడాలనుకున్నప్పుడు ఆలోచించనవసరం లేదు.

ప్రేమిస్తున్నప్పుడు, సహకరిస్తున్నప్పుడు నీ గురించి నీవు ఆలోచించనక్కరలేదు. ఇదే ఉత్తమ తెలివి, ప్రేమ. (FLF సారం)

## కరుణ - నేను వినా

"నేను" లేనపుడు కరుణ వుంటుంది. ఆ కరుణ స్పష్టతనిస్తుంది. ఆ స్పష్టతతో నైపుణ్యం వస్తుంది. (WL-201)

## నేనే - ఈర్ష్య

"నేను కోపంగా వున్నాను. అది వాస్తవం అయితే "నేను" కోపానికి వేరుగా లేను. అదీ వాస్తవం. "నేను" ఈర్ష్యకు వేరు కాను. దానికి వేరైన వాణ్నని అనుకుంటాం. ఎందుకంటే, దాంతో ఏదో చేయాలని, దాన్ని ఉంచుకోవడమో, వదులుకోవడమో, హేతుబద్ధం చేయడమో, ఏదో, ఏదో. కాని నిజానికి "నేను" ఈర్ష్యను. (A I-70)

## నేను —విభజన

"నేను" పరిశీలకుడిని, "నేను" గతం, ప్రస్తుతాన్ని గతంగా, భవిష్యత్తుగా "నేను" విభజిస్తుంది. పరిశీలకుడు, అనుభవపరుడు, ఆలోచనాపరుడు ఉన్నంత కాలం విభాగం తప్పదు. పరిశీలించేవాడు, పరిశీలింప బడేది ఒకటైనప్పుడు ఘర్షణ తొలగుతుంది· ఈర్ష్య ఆగిపోతుంది, ఈర్ష్యే ఘర్షణ, అవునుకదా! (A I-72)

## సెక్సు—జ్ఞాపకం

లైంగిక సంబంధం (SEX) ఆలోచన ఫలం కాదా! జ్ఞాపకం నుండి బలపడిందే కదా! లైంగిక క్రియలో, ఆత్మ విస్మృతి (Self forgetfulness), ఆత్మ, త్యాగము వుంటాయి, జీవితం భయం-ఆదుర్దా- ఆవేదనలు లేక పోతాయి. ఇవి గుర్తుండి మళ్ళీ మళ్ళీ కావాలంటారు. పునరావృత్తి వినాశకర ప్రక్రియ. (TOR-79)

## ఆరాటం

ఆరాట పడడమనేది స్మృతి. తెలిసిన దాన్ని బట్టే ఆరాటం వున్నదాని యొక్క స్మృతి. ఈ ఆరాటమే "నేను" (లేక) ఆత్మ (లేక) అహం అనుదానిని పోషిస్తుంది· తెలిసిన విషయం శాశ్వతంగా వుండాలనుకొంటుంది. అది మనసు నుండి తొలగ గలదా? మనస్సు దాన్ని మరచిపోగలదా? ఇదే అసలు సమస్య (FLF-255)

## స్వ-లాభం

స్వ ప్రయోజనం, నిరంతర ఆత్మాభివృద్ధి మనస్సును కుంచింప జేస్తాయి: వాటి కార్యక్రమాలు ఎంత విశాలంగా, ఎంత సిద్ధాంతపరంగా ఎంత కళా సంస్కృతుల్లో వున్నా సరే. (CL IV-154)

## సంపాద ఏదైనా — బంధమే

కనుక త్యాగం గాని, ఆత్మాహుతి గాని గొప్పతనానికి సూచన కాదు.

పొగడతగింది కాదు. పొందతగిందీ కాదు· మనమేదో పొందాలి,లేకపోతే మనంలేం! సముపార్జనలు చాలా వున్నాయి, రకరకాలు. ప్రాపంచికమైనవి పొందనివాడు జ్ఞానానికి, అభిప్రాయాలకి కట్టుబడి వుండవచ్చును. కొందరు, పుణ్యానికి, పేరుకు, కీర్తికి కట్టుబడి పోతారు. అర్జన లేకపోతే "నేను" లేను. "నేను" అనేదే అర్జన లేక సంపాదన; అది వస్తుసామగ్రి కావచ్చు, పుణ్యం కావచ్చు, పేరు కావచ్చు.... పై (స్థాయి)కి వెళ్తే ఆ నేను ఇంకా తృప్తికరమైంది, శాశ్వతమైంది. అస్థిరత్వంగా వుండటంతో ఏదో బంధం కావాలి. సంపాదించింది అసంతృప్తిగా వుంటే ఇంకా ఆనందాన్నిచ్చే బంధం కావాలి. చిట్ట చివరి సంతృప్తి ఏమంటే దేవుడనే పదం; దాని బదులేమైనా కావచ్చు, దేశమైనా కావచ్చు. (CL I-162)

## కోరిక

కోరిక సవాలుకు సమాధానం కాదు, సరిపోదు . అందమైన కారుని చూడడం ఆనందాన్ని కలచివేస్తుంది. ఈ కలచి వేయడం కోరికయొక్క చైతన్యం బాధ వల్లో, సంతోషం వల్లో కలిగిన అలజడిని చూపడమే ఆత్మ చైతన్యం. ఆత్మ చైతన్యం (SELF CONSCIOUS) అంటే కోరిక....ఘర్షణే ఆత్మ చైతన్యం. (CL I-50)

## పరిశీలన

పరిశీలించేవాడు లేనపుడు పరిశీలింపబడేది మాత్రం వుంటుంది. ఇది గమనించండి. నేను అసూయగ్రస్తుడను లేదా నేను అతిగా వింటున్నాను. నేను అత్యాశాపరుణ్ణి. మామూలుగా దీని ప్రతిచర్య ఏమిటి? నేనెక్కువ తిన కూడదు; నేనత్యాశాపరుణ్ణి కాకూడదు; నేను అణచాలి. ఈ వరుసలోని తతంగమంతా తెలిసిందే అందులో పరిశీలించే వాడు ఒకడున్నాడు. అతడు అత్యాశను, అసూయను అదుపు చేయాలని ప్రయత్నిస్తుంటాడు. పరిశీలించేవాడు లేకుండ అత్యాశ యెడల జాగృతి గనక వుంటే అప్పుడు ఏం జరుగుతుంది? దానికి అత్యాశ అని పేరు పెట్టకుండ నేడు దానిని పరిశీలించగలనా? దానికి పేరు పెట్టిన తోడనే, దాన్ని అత్యాశగా నా స్మృతి ఫలకంలో బంధించి వేశానన్న మాట.

## పరిశీలన క్రమశిక్షణ

ఇక నేను దాన్ని అధిగమించాలి, దాన్ని నియమించాలి అని మనసు అంటుంది. నా మకరణం చేయకుండ, సమర్థించకుండ, దూషించకుండ ఎట్టి ప్రతిచర్య లేకుండ అత్యాశయెడల పరిశీలన వుందా?

పరిశీలించడమనేది ఒక విధమైన క్రమశిక్షణ! అది తెచ్చిపెట్టుకున్నట్టిది కాదు సుమా! కేవలం పరిశీలన. అపుడు మనసు శక్తి నెంత మాత్రం వృథా చేయడం అంటూ ఉండదు. అది జాగృతి వహిస్తుంది. పరిశీలించే దానితో వ్యవహరించ గలుగుతుంది. (A I-476)

## పై పై బ్రతుకులు

మనలను గూర్చిన అభిప్రాయాలన్నీ కాపాడుకుంటాం, అభిప్రాయాన్ని నిల్వ కేంద్రాన్ని కాపాడకపోతే "నేను" లేదు, "నాది" లేదు. అపుడు మనల్ని గురించి మనకు తేట తెల్లమౌతుంది, స్పందిస్తాం, "నేను" అనే దాని ప్రక్రియను కనుగోడానికి ఇష్టపడం గనుక, మనల్ని గూర్చిన అభిప్రాయం మీదికి ఏదైనా వస్తే ఎదుర్కొంటాం. మనల్ని గూర్చిన అభిప్రాయం కూడ పైపైనే వుంటుంది. మనలో ఎక్కువ మందిమి పైపైన బ్రతుకుతాం కాబట్టి, భ్రమల్తోతృప్తి చెందుతాం. (CL I-91)

## ప్రాపంచిక ఆధ్యాత్మిక బిరుదులు

ఏదో కావాలనీ, ఏమీ కాకుండా వున్నామే అనే భయంతో, ఏ సంస్థకో, సిద్ధాంతానికో, చర్చికో, గుడికో చెందిపోతాం, కనుక నీవు దోచుకోబడతావు; నీవు కూడ నీ అవకాశం చొప్పున దోచుకుంటావు. ఈ వంశపారంపర్యపు విధానం అహం-వ్యాపకత్వానికి చక్కని అవకాశం. సోదరత్వం కోరవచ్చు, కాపీ ఆధ్యాత్మిక వ్యత్యాసాలు పాటిస్తుంటే సోదరత్వం ఎలా వుంటుంది? బాహ్యప్రపంచపు బిరుదులు చూసి నవ్వవచ్చు, ఆధ్యాత్మికంగా పరమగురువునో, గురువునో, రక్షకుణ్ణో అంగీకరిస్తే, అది ప్రాపంచిక ధోరణిని అనుసరిస్తున్నట్లే కదా! ఆధ్యాత్మిక ప్రగతిలో వంశ పారంపర్యపు విభాగాలుంటాయా? సత్యావగాహనలో అవి వుంటాయా? దైవాన్ని తెలిసికొనడంలో అవి వుంటాయా? ప్రేమకు అలాంటి విభాగాలు లేవు; ప్రేమించడమో, ప్రేమించలేక పోవడమో! (CL I-94)

## సృజనాత్మకత-పద్ధతి

ఒక పద్ధతితో, చిట్కానో నేర్చుకుంటే మనం సుఖంగా, సృజనాత్మకంగా జీవించ వచ్చుననుకుంటాం. సృజనాత్మక సౌఖ్యం, అంతస్సంపద వల్ల మాత్రమే లభిస్తుంది. ఏ పద్ధతిద్వారా అది రాదు. ఆత్మాభివృద్ధి (SELF IMPROVEMENT) అనేది "నేను" "నాది" అనబడే వాటిని భద్ర పరచడానికి మరో

మార్గం. అది సృజనాత్మకం కాదు. అది సౌందర్యం యెడల ప్రేమకాదు, మనసు పోకడల యెడల సతతం జాగృతి వున్నప్పుడే, తనకు తా పెట్టుకున్న అడ్డంకుల యెడల జాగృతి వున్నప్పుడే సృజనాత్మకత వెలువడుతుంది. (ESL)

## మనోతీత స్థితి

మనకు ఇంకా ఇంకా కావాలి. ఇది ఆత్మాశ! అహంకారం తొలగాలనే హడావుడి "అహం" యొక్క నూతన పోకడ. కాని అది నూతనం కాదు. ఆశ యొక్క మరో రూపం. మనసు అప్రమత్తంగా నెమ్మదైనపుడు. వేరేది, మనసుకు సంబంధించింది కానిది ప్రత్యక్షమౌతుంది. (CL II-155)

## ఆత్మోన్నతి

ఆత్మ-అభివృద్ధి అంటే మధ్యరకంది, మందకొడిది. అందుకు సాధనాలు ఎంత పెద్దగా వున్నా అది ఆత్మను మూసివేసే ప్రక్రియ. ఆశ అంటేనే "ఆత్మను" నెరవేర్చుకోవడం. తెలిసిన దాని మొత్తం కేంద్రం. "నేను" గొప్పది మనస్సు కాదు, అప్రమేయమైంది! తెలిసింది పోల్చదగింది. తెలిసిన దాని ప్రక్రియలు దుఃఖ కరాలు (CLII-241)

## ఆత్మ– త్యాగం

ఒక ఫలాన్ని పొందాలని చేసే త్యాగం సరుకు మార్పిడి వ్యాపారం. దాంట్లో ఇవ్వడమనేది ఉండదు, మార్పిడి మాత్రమే. ఆత్మ, త్యాగం అనేది ఆత్మను పెంచుకోవడమే. ఆత్మను త్యాగం చేయడమంటే ఆత్మకు పదును పెట్టడం. అది ఎంత సూక్ష్మంగా తయారయినా అది సంకుచితం, అల్పపరిమితం. (CL I- 161)

## ఆత్మ తాదాత్మ్యం

గొప్పదాంతోనో ఏదో రూపొందే వాతావరణంతో అనేక రకాలుగా ఆత్మతాదాత్మ్యం చెందడంలో వైపరీత్యాన్ని లేక అసంగతాన్ని గుర్తించాం. అది వొట్టిదని గ్రహిస్తారు. నమ్మకాల్లో గొప్పవిగాని కొద్దివిగాని-వుండే పైపై మెరుగులు కూడ తెలుస్తున్నాయి. (BV-153)

## సాధనలు అహాన్ని పెంచుతాయి

సాధనలు, శిక్షణలు, అహాన్ని పెంచుతాయి. ప్రాముఖ్యతను, మర్యాదను తెస్తాయి. తెలియనిది ఉండాలంటే, తెలిసింది మనస్సు నుండి తొలగాలి. అందుకు

అహం మార్గాలు, ఆరాటాలు తెలియాలి. లేకపోతే మనస్సు యొక్క తాపత్రయాల ననుసరించే వాటి ప్రతిబింబాలుంటాయి. (సారం : CL II-239)

## ఏకాగ్రత—సావధానత

ఏకాగ్రత (CONCENTRATION) వహించడంలో ప్రయత్నశీలుడు, ధ్యేయం ఉన్నాయి. కనుక ఏకాగ్రత నేను-ఆత్మ-అహం అను దానిని బలపరుస్తుంది. సాధనపరుడుగా, విజయ శీలిగా, పవిత్రుడుగా బలపడుతాడు. సావధానతలో ఈ ద్వంద్వ క్రియ వుండదు. అనుభవించేవాడు, ప్రోగుచేసేవాడు, నిల్వచేసేవాడు ఉండడు. పొందే దానిలో ఘర్షణ, పీగిపోతామనే భయం ఉండవు. (CL II-237)

తన్నుతాను తెలిసికోవడం వల్ల సావధానత వస్తుంది, అందులో "అహం" వుండదు.

## ఆలోచన—పరమాత్మ

నీ భయం నుండి, నీ గుణాల నుండి, నీ ఆలోచనల నుండి నీవు వేరా? నీ ఆలోచనలే నీవు. ఆలోచన "నీవు"ను సృష్టిస్తుంది. ఆ "నీవు" వేరే ఉపాధి అనుకుంటావు. ఆలోచన లేకుండ ఆలోచించే వాడు లేడు. ఆలోచన అశాశ్వతమైనదని గ్రహించి, శాశ్వతంగా వుండేందుకు ఆలోచించే వాడిని సృష్టిస్తుంది. అతడు సహించేవాడు, ఇక ఆలోచించేవాడు అనుభవ పరుడు, విశ్లేషకుడు, పరిశీలకుడు అవుతాడు. అశాశ్వతమైన దానికి వేరుగా వుంటాడు....ఈ ఆలోచించేవాడు ఇతరమైన ఇంకా ఉన్నత, శాశ్వత స్థితులు సృష్టిస్తాడు. ఆత్మ(Soul) ఆత్మన్ (Atman) పరమాత్మ (High Self) మొదలగునవి సృష్టిస్తాడు. ఈ మొత్తం నిర్మాణానికి ఆలోచనే పునాది. (CL II-61)

## నిశ్చలతకు ఆశ్రయాలు కావాలా?

అహాన్ని కాదనడానికి యతి జీవితమవసరమా? నిస్వార్థ జీవితమనే భావన ఉంది. అహం లేని జీవితాన్ని అర్థం చేసికోవడానికి అవరోధం. ఈ నిస్వార్థ జీవితమనే భావనయే. భావన అహం యొక్క మరో రూపం. మతాలకు, ఆశ్రయాలకు తప్పించుకుని పోకుండా, అహం చర్యల యెడ నిశ్చేష్టితంగా, మెలకువగా వుండలేమా? ఈ ఎరుక మొత్తానికి వేరే కార్యకలాపం కొని తెస్తుంది. అది దుఃఖాన్ని, క్లేశాన్ని ఇవ్వదు. (CL II-204)

## ఆత్మ ఉందా? లేదా?

ఆత్మ (ATMAN) వుందని కొందరు, కనీసం హిందువులు నమ్ముతారు. (మనం చిరుబురు లాడే విషయంలోకి వచ్చాం). శాశ్వత మైంది వుందని అను కుంటారు. అది ఒక ఐడియా, అభిప్రాయం, సిద్ధాంతం, భావన: అవునుకదా! కాదు? శంకరాచార్యో లేక వేదాంతో లేక పక్షో చెప్పారు-ఆత్మవుందని. అది ఏదైనా కావచ్చు ఒక ఆధ్యాత్మిక పుటునికి లేక ఒక అభిప్రాయం మాత్రమే! కాదా!

ప్రశ్న : ఇప్పుడది సంకల్పమే కావచ్చు, కాని కాలక్రమేణా అది వుందని మనకు మనమే కనుగొంటామనే ఆశిస్తాం.

ఏదో ఒకటుందని ఒప్పుకొని భావిస్తే, నీవు దాన్నలాగే కనుగొంటావు: మానసికంగా ఆ ప్రక్రియ సుళువయిందే! అసలు దేన్నయినా ప్రకటించడ మెందుకు, వూహించడ మెందుకు? (A I-260)

## 'ఆత్మ' పుట్టుక

పృచ్ఛకుడు : ఆత్మ అంటే ఏమిటి?

కృ : మన సంస్కృతి, మన నాగరికత "ఆత్మ"అనే శబ్దాన్ని సృష్టించింది. భారతీయ నాగరికత చూడండి-అనేక మంది మనుషుల సామూహిక కోరిక, సంకల్పం, నాగరికత కాదా!....నశించే ఈ శరీరాని కన్నా, నశించనిది ఒకటుండాలని భావించారు కనుక ఆత్మభావం నెలకొల్పారు. అపుడపుడు ఒకరిద్దరు చావులేని అసాధారణ స్థితిని కనుగొని ఉండవచ్చు. దానిని శాశ్వతమన్నారు. ఇక మందబుద్ధులందరు "అవును, అది నిజం అయి ఉంటాలి, అతడు సరియైయుంటాలి" వాళ్ళకి శాశ్వతమైనది కావాలి కనక "ఆత్మ" అనే పదాన్ని పట్టుకున్నారు.

## శాశ్వతత్వ పరికల్పన

మనలో లోపల, బయట ఉన్న ప్రతిదీ అశాశ్వతమే. చలనంలో ఉంది. ఇది తెలిసి మనసు శాశ్వతత్వాన్ని గూర్చి ఆరాటపడుతుంది. కాలంగాని, సంఘటనలు గాని నాశనం చేయలేని, ఎల్లపుడూ కొనసాగే శాంతి, ప్రేమ, మంచితనం, భద్రత కొరకు తాపత్రయ పడుతుంది. కనుక అది ఆత్మను శాశ్వత స్వార్థం యొక్క దృశ్యాలను సృష్టిస్తుంది. ఈ శాశ్వత్వం, అశాశ్వతత్వం నుండి పుట్టిందే కనుక దానిలో అశాశ్వతమైన బీజా లేర్పడి ఉన్నాయి. ఒకే ఒక వాస్తవం-అది అశాశ్వతం.

(FLF-253)

## కేంద్రం ఉన్నంత వరకు వలయం ఉంటుంది

మందుల ద్వారా (PSYCHE DELIC EXPANSION OF THE MIND), ధ్యానం ద్వారా, అనేక సంకల్పాల ద్వారా వ్యాపకం చేసికోవాలను కుంటుంది. కాని కేంద్రం ఉన్నంత కాలం వలయం పరిమితమే. ఆ వలయంలో అది బందీ. ఆ వలయం ఒక జైలు. అందులో నేను స్వేచ్ఛగా ఉన్నాను, అంటుంది కేంద్రం. సాహిత్యం ద్వారా, సంగీతం ద్వారా, కళద్వారా, మందుల ద్వారా, అనేక ప్రక్రియల ద్వారా చేతనత్వాన్ని ఇంకా వ్యాపకం చేసికోవడం సాధ్యమా అని అడుగు తుంటారు. కేంద్రం పరిశీలించేవాడు, ఆలోచించేవాడు, గమనించే వాడు ఉన్నంత వరకు ఏంచేసినా ఆ జైలుగోడల్లోనే....మీలో మీరు వాస్తవంగా ఇది చేసి చూడండి. దాని అందం మీకు తెలుస్తుంది. (A I-267)

తాగుడెలా ఉంటుందో తెలిసికొనడానికి నేను తాగనక్కరలేదు. అది చూస్తున్నాను. (A I-268)

## ఆత్మ భావనల సంఘర్షణకు పునాది

భౌతికమైన ఉనికిని మించింది మరొకటి ఉంటుందేమోనని తెలిసికోవాలని మీకు కూడ ఉన్నది కదా! ఉద్యోగాలకు, తగాదాలకు, ఈర్ష్యలకు, సంతానానికి, గాలి కబుర్లకు, పనికిరాని మాటలకు మించినదేమైనా ఉందా అని తెలిసికోవాలని వుంది. కాలాతీతమైంది,అవి నాశనమైంది అనే అభిప్రాయాలు "ఆత్మ" అనే పదంలో ఉన్నాయి. మీకు మీరు తెలిసికోరు. "నాకు క్రైస్తు, శంకరుడు, సంస్కృతి చెప్పిందాంతో పని లేదు, నాకు నేను తెలుసుకుంటాను." అని అనరు. సామూహిక సంకల్పానికి ఎదురు తిరగరు "అపును ఆత్మవుంది" అంటారు· పైగా, దాన్ని ఒకరు ఒకటంటారు, మరొకరు మరొకటంటారు, ఇద్దరు రెండు ముఠా లౌతారు, విరోధులౌతారు. విరుద్ధ విశ్వాసాలతో (TMC - 48)

## ప్రశ్నోత్తరాలు నేను ఎవరు?

"నేను భయపడుతున్నాను అనేది ఎవరు? అని అడుగుచున్నారు. నీవు ఈర్ష్యతో ఉన్నావు "ఈర్ష్యతో ఉన్నాను" అనేది ఎవరు?

అహం అనేది ఎవరు? విశ్లేషణ చేయండి. విశ్లేషణ అంటే తెలుసు గదా!

అంచెలంచెల మీద వెళ్ళండి. శంకరునో మరెవరినో ఉదహరించకండి. నేను భయ పడుతున్నాను అన్నపుడే "నేను" ఎవరు?

పృచ్ఛకుడు, శాశ్వతమనుకొనే ఆలోచనకదా ఈ క్షణంలో వుంది?

ఈర్ష్యగా వున్నట్లు తెలిసికొన్నదెవరు? ఆ సత్యానికి (ENTITY) లేక ఆలోచనకు ఎలా తెలుస్తుంది? అంతకు ముందు ఈర్ష్యను అనుభవించింది కనుక ఇప్పుడు ఆ జ్ఞాపకంతో గుర్తించింది. ఇది చాల క్లిష్టమైంది. సూక్ష్మమైంది ఎంతో శ్రద్ధపుంటేగాని అవగాహన కాదు. జ్ఞాపకం యొక్క స్పందనే ఆలోచన. అది నిన్నటి దాన్ని గుర్తుంచుకొని, మళ్లీ ఇవ్వాళ జరిగింది అదేనని చెపుతుంది. అట్లా అది సాగుతూవుంది. బలపడుతూ ఉంది. అదే సంప్రదాయం, జ్ఞానం, అనుభవం. జ్ఞాపకమే కేంద్రం. ఆ కేంద్రం ఇది నా ఇల్లు....అం టుంది.జ్ఞాపకాల మూటే కేంద్రం. ఆ కేంద్రమే హింస, అజ్ఞానం, ఆకాంక్ష, అత్యాశ-దానికి బాధ ఉంది, నిరాశ ఉంది, సంతోషం ఉంది, దాని చుట్టు కొంత స్పేస్ అల్లు కుంటుంది. (నెమ్మదిగా పెద్దాం ........ఆ పెద్దమనిషి నన్ను మళ్ళీ చెప్పమంటున్నాడు క్షమించండి, అయ్యా, నేను మళ్ళీ చెప్పలేను. నేను చెప్పింది నే గుర్తుంచుకోలేను) (A I-265)

జ్ఞాపకాల లేక సంప్రదాయాల మూటయైన కేంద్రం వత్తిడి ద్వారా ప్రభావం ద్వారా ఏర్పడింది. హిందూ సంస్కృతిగా, ముస్లిం సంస్కృతిగా ఈ కేంద్రం కాల ప్రభావం వల్ల ఏర్పడింది. కేంద్రం కాబట్టి దాని చుట్టూ స్పేస్ (ఖాళీ) ఉంది. చలనం వల్ల స్పేస్ ఉంది. కదలిక ఉన్న దానికి స్పేస్ వుంటుంది. ఇది ఇంకా ఎక్కువ స్పేస్ కావాలని కోరుతుంది. ఆ కేంద్రమే చైతన్యం. దాని అంచుల్ని "నేను" గా గుర్తిస్తుంది. కేంద్రం ఉన్న తరువాత దానికి వలయం ఉండాల్సిందే.

(AI-267)

మిగతా వన్ని ప్రక్కకు నెట్టి మీరనుకొనే బ్రహ్మన్ విషయం చూద్దాం, నిజంగా దీన్ని గూర్చి నొక్కి చెప్పాలంటే ఇది ఊహించే మనస్సు కనిపెట్టిన ఒక సిద్ధాంతం. అది శంకరుడు కావచ్చు, లేక ఆధునాతన వైదుష సైద్ధాంతికులు కావచ్చు. సిద్ధాంతాన్ని అనుభూతిచెంది, అది ఇది అనవచ్చు. అదెలా వుంటుందంటే క్రీస్తు దృశ్యాలుండే, కాథలిక్ వాతావరణంలో ఒకతనిని నిబద్ధంచేసి, తయారుచేస్తే అలాంటి దృశ్యాలే స్వయం నిబద్ధత నుండి ప్రతిబింబిస్తాయి, కృష్ణుని యొక్క లేక క్రీస్తుయొక్క దృశ్యం గుర్తించడం నిబద్ధమైన జ్ఞానం యొక్క ఫలం. కనుక అది వాస్తవం కాదు. ఒక తమాషా, ఒక భ్రమ, అనుభవంతో బలపడింది.

(TOR-12)

## సిద్ధాంతాలు సత్యాలుగా ఎలా మారతాయి

ఏ మాత్రం విలువలేనిది అసలు సిద్ధాంతమెందుకు? ఏ నమ్మకాన్నైనా ఎందుకు అంగీకరిస్తారు. నమ్మకాన్ని నిరంతరం నిర్ధారణ చేయడం భయం. నిరర్ధక జీవిత భయం. ఇదంతా చూసి ఒక సిద్ధాంతాన్ని కనిపెడతారు. అది ఎంత యుక్తితో, ఎంత పాండిత్యంతో వుంటుందో అది అంత విలువుగా వుంటుంది. రెండువేలు లేక పదివేలు సంవత్సరాల ప్రచారం తర్వాత ఆ సిద్ధాంతం తప్పని సరిగా, మూఢంగా "సత్యం" అవుతుంది. (TOR-12)

దీని నుండి తొలగడానికి శంకరుని పద్ధతి పనిచేయదు, బుద్ధుని పద్ధతి పనిచేయదు, మీ కిష్టమైన గురువు పద్ధతి పనిచేయదు; పద్ధతి కాలబద్ధమైంది.

## పద్ధతులు, స్వేచ్ఛ, ముక్తి

కాలానికి విలువలేదు. కేంద్రం నుండి స్వేచ్ఛ పొందక పోతే నీకు స్వేచ్ఛ లేదు. అందుకు బాధపడతారు. ''బాధతొలగదా?'' అని అడుగుతారు, దీనికి సమాధానం పుస్తకంలో వుంటుందా? సిద్ధాంతంలో వుంటుందా? ఏం చేస్తారు? ఇంత వరకు పరిశీలించిన మనస్సు ఇపుడెట్లా వుంది? దానికేమైంది? ఈ ప్రశ్న వెయ్యి? (A I-270)

## సాధన బానిసత్వమే

దేవుడుతోనో, అభిప్రాయంతోనో, ఆదర్శంతోనో, సూత్రంతోనో గుర్తింపు పొంది (Identification) వ్యాపకం కావాలని చూస్తుంది. శైలి నుండి తప్పించుకోలేదు గనుక భావనలు అమితమైన ప్రాముఖ్యం చెందుతాయి. కేంద్రమే ఆలోచన గనుక అది జాతితో, కుటుంబంతో, వర్గంతో, సంస్కృతితో గుర్తింపు పొంది వ్యాపకం కావాలనుకుంటుంది. అపుడు తప్పించుకోడానికి కాలాన్ని కనిపెడుతుంది. సాధన చేస్తానంటుంది. రేపు, ఎల్లుండి, వచ్చే జన్మలో పొందుతానంటుంది. ఇది తన చుట్టూ పెంచుకున్న దేశానికి, సృష్టించుకున్న కాలానికి బానిస అవుతుంది. అది గమనించారండీ! (A I-268)

## మిథ్యాచరణం

యౌవనంలో జీవితాన్ని అర్థం చేసికోరు. లోపల క్రూరంగా, పైకి

సాధువుల్లా తిరుగుతారు- డబ్బుంది. బయటకు వచ్చి విశాలాకాశాన్ని చూడరు. చూడాలంటే ప్రేమ వుండాలి. (TMC-46)

## మనసు-కేంద్రం

మనసు, అది చేస్తున్న పనిని పరిశీలించడం వల్ల, అది చేసిన పనిని చూడ డంవల్ల,అది నిర్మించిన కేంద్రాన్ని చూడడంవల్ల,కేవలం పరిశీలించడంవల్ల అది చాలా అసాధారణంగా మెలకువ పొందింది. నీవేమీ చేయలేదు, అంచెలంచెల మీద ఆలో చనా గమనాన్ని గమనించడం వల్ల అసాధారణంగా స్పష్టత చెందింది. స్పష్టంగా వుండి, కేంద్రం ఎలా తొలుగుతుందని ప్రశ్నిస్తుంది. ప్రశ్న వేసేసరికే కేంద్రం యొక్క మొత్తం నిర్మాణాన్ని గమనిస్తూనే వుంది. నేను ఆ చెట్టును చూస్తున్నట్లు వాస్తవంగా దీన్ని కూడ చూస్తున్నాను. (A I-172)

## చూడడమే సరళత

చూడడమంటే ఏమిటి? దీన్నా? దాన్నా? నిజంగా చూడడానికి దేశ కాలాలు లేవు. నీవు సృష్టించిన స్పేస్, కాలం లేకుండ అనగా కేంద్రం లేకుండ చెట్టును చూడగలిగితే అపుడు అప్రమేయమైన దేశం వుంటుంది. ఎలా చూడాలో, ఎలా వినాలో మొదట నేర్చుకోవాలి? అది నేర్చుకోరు, సరళంగా జీవితాన్ని మొదలు పెట్టరు. వేషం వేసికొని, మూడవ క్లాసులో ప్రయాణం చేస్తూ, ఏదో ధ్యానం చేస్తూ అది సరళత్వం అని అనుకుంటారు. అది కాదు ఉన్నవాటిని ఉన్నట్లుగా చూడడమే సరళత. కేంద్రం లేకుండ చెట్టును చూడడమే.

(AI 272- మద్రాసు 9 జనవరి 1968)

కృ: ఆలోచన సమసిపోతే తెలివి మేల్కొంటుందా? అది ఎప్పుడూ వుం టుందా? కాలబద్ధం కాదా? (AI-510)

బూమ్ : వుండొచ్చు, వుండక పోవచ్చు, లేదా తెలివికి ఏదైనా అడ్డు తగలొచ్చు.

కృ :- హిందువుల సిద్ధాంతం వుంది: ప్రజ్ఞ లేక బ్రహ్మ శాశ్వతం; దాన్ని భ్రమ, పదార్థం, బుద్ధి తక్కువ తనం, ఆలోచన సృష్టించిన టక్కరి విష యాలన్నీ కప్పి వేస్తాయి అంటారు. అంతవరకు వెళ్తావేమో నాకు తెలియదు.

బూమ్ : తెలివి యొక్క బాహ్య రూపం వాస్తవంగా చూడడం.

కృ :- వాటన్నిటినీ తొలగించండి అది అక్కడ వుంటుంది. కాబట్టి ఎల్లప్పుడూ అది వుందనే వాళ్ళ యొక్క ఊహ. (A I-511)

## సుఖానుభూతి-అనుభవానికి అతీతం

నీవు సుఖంగా వున్నపుడు సుఖంగా వున్నట్లు తెలియదు. సుఖం లేనపుడే దాని కొరకు వెతుకుతావు. నీవు సుఖంగా వున్నట్లు తెలిసిందనుకో, ఆ క్షణమే సుఖం అంతమైపోతుంది ఆత్మ(న్) అతి మానసం, పరమ గురువు- ఏ పేరు పెట్టినా సరే; దాన్ని గూర్చిగజిబిజి లేకుండ స్పష్టంగా వుండాలని చూడడంలో నీవు గందర గోళం నుండి పనిచేస్తున్నావు. నిబద్ధమైన మనస్సు ప్రభావము నుండే నీ క్రియ వుత్పన్న మవుతుంది. అవును కదా! (CL III-179)

# అనుభూతి - తెలివి

అనుభవం, అనుభూతి అను శబ్దాలకు అర్థం వొకటే. భవం అంటే పుట్టడం, కలగడం, జరగడం, రావడం, ఏర్పడడం అని చెప్పుకోవచ్చు. 'అను' అనేది ఉపసర్గ. దానికి అనుసరించి, బాగా విశేషముగా అని అనుకోవచ్చు అను భావం అనుసరించి, కలిగించి, బాగా పొందింది అని యర్థం. ఒక్కొక్క క్రియ ద్వారా ఒక్కొక్క సంఘటన ద్వారా, ఒక సన్నివేశం ద్వారా, ఒక సంకల్పం ద్వారా మానవుడు ఒక పాఠాన్నో, గుణాన్నో, భావాన్నో, ప్రయోజనాన్నో, సంతోషాన్నో, దుఃఖాన్నో, పొందుతాడు. జీవితంలో ఏదో సంపాదిస్తాడు, గ్రహిస్తాడు లేక గడిస్తాడు. అది అతని అనుభూతి లేక స్వానుభవం. అది భౌతికంగాను ఉంటుంది, మానసికంగాను ఉంటుంది.

అనుభవం మొదటిసారి పొందవచ్చు, రెండవసారి పొందవచ్చు, అనేకసార్లు పొందవచ్చు. అలాగే అది కొత్తది కావచ్చు, పాతది కావచ్చు, పునరుక్తి కావచ్చు. తొలిది నూతనత్వాన్ని, స్పందనను, సంతోషాన్ని ఇస్తుంది. అది ఒక చర్య, మలిది పాతదై పోతుంది. మామూలుగా వుంటుంది. వినోదం కల్గిస్తుంది. మానసిక తృప్తి నిస్తుంది. అది ప్రతి చర్య. పూర్వచింతనగాని పూర్వ జ్ఞానంగాని లేకుండ కలిగే అనుభవం మనిషిని కుదిపేస్తుంది. జలదరింపు నిస్తుంది. నిండుగా పనిచేస్తుంది. ఏ అనుభవానికైనా అప్పటి కప్పుడు కలిగించే ఫలం. ఎప్పటికప్పుడు పొందిందే ప్రయోజనం. అది అంతటితో సరి.

అనుభవించడం జరగ్గానే అది అనుభూతి అవుతుంది. అంటే గతానికి సంబంధించింది అయిపోతుంది. కాలగర్భంలో కలిసిపోతుంది. అది జ్ఞానం క్రింద చలామణి అవుతుంది. ఒక కథగా దొర్లుతుంది. స్మృతిగా మిగులుతుంది. స్మృతి వాస్తవం కాదు కదా, పైగా బరువౌతుంది. కనుక జరిగిపోయిన దాన్ని జ్ఞాపకం తెచ్చుకోవడం, చింతించడంవల్ల, వల్లించడం వృథా. కాలయాపన, అంతేగాక వర్తమానం నష్టమైపోతుంది, తక్షణ కర్తవ్యం దెబ్బతింటుంది.

అనుభవం ఒక గుణపాఠం అనేది సరైనమాట కాదు. ఎందుచేత అంటే ఏ అనుభవానికి ఆ అనుభవమే పూర్తి. ఎవరి అనుభవం వారిదే. పరిస్థితులు, సందర్భాలు, అవసరాలు ఎప్పటికప్పుడు మారిపోతుంటాయి. ఎప్పటి స్థితిగతులప్పుడివే. ఏ క్షణానికి ఆ క్షణమే అవగాహనకు ఆయత్తం కావాలి. అనుభవాల పేర బెట్టుకొని గాని, స్మరించుకొనిగాని తెలివి గడించడం పొట్టిది. దానివల్ల వికాసం పొందాలనడం భ్రమ. అయితే భౌతికమైన అనుభూతులు కొంత సరిచేస్తాయి. జాగ్రత్తనిస్తాయి. మానసికమైన అనుభూతులు పూర్తిగా మరచిపోతగ్గవి.

అనుభవంలో స్వార్థం ఇమిడి వుంటుంది. స్వార్థమనేది సంకుచితమే కాని వికాసం కాదు కదా, కనుక అనుభవం స్వేచ్ఛనిచ్చేది కాదు. సదా వాంఛనీయమూ కాదు. అలా చూసినపుడు అనుభవాల మీద ఆధారపడవలసిన పనిలేదు. అవి పూజనీయాలు కాదు. కాని మెరుగు పెట్టి వాటిని మార్కెటులో అమ్ముకోవచ్చు. లోకంలో అది లాభసాటి వ్యాపారం. ఈ దినాల్లో అదే జరుగుతున్నది.

లోకానుభూతులు వేరు, దివ్యానుభూతులు వేరని విభజిస్తాం. రెండవ తెగని పూర్తిగా మనోమయాలు, పూహాత్మకాలు, భ్రమోత్పాతాలు, ప్రమాదభూతాలు. కాబట్టి వాటియెడ మరింత జాగ్రత్తపడవలసిన అవసరముంది:

అనుభూతివేరు, అవగాహనవేరు. ఒకటి గతానిదైతే, రెండోది వర్తమానానిది అవగాహన వల్లనే వివేకం, సక్రమత యేర్పడేది. బాధ్యత, ప్రేమ పుట్టుకొస్తాయి. మనస్సుకు విశాలత యేర్పడుతుంది. అనుభూతిని వదిలి అవగాహనకు మొగ్గు చూపితే మనస్సు నిర్నిబద్ధంగా, తేలికగా, లోతుగా, నిస్తులానందంగా వుండడానికి వీలవుతుంది. ఆ ఏకత్వంలో సమగ్రత వుంది.

అయితే ఎవరికి వారు గ్రహించాలి. పరిశీలించుకోవాలి. తెలిసికోవాలి. బుద్ధి రీత్యా గాక, హృదయరీత్యా. అదియే సరియైన స్వానుభవం.

ప్రజ్ఞలో "జ్ఞ" తెలివికి సంబంధించింది. "ప్ర" ఉపసర్గ. విశేషాన్ని తెల్పుతుంది. ప్రజ్ఞ అంటే మంచి తెలివి, విశేషమైన తెలివి. Intellect అంటే బుద్ధి, యుక్తి, మేధస్సు, ధీ అనికూడ చెప్పుకోవచ్చు. Intelligence అంటే ప్రజ్ఞ, ప్రతిభ అని చెప్పుకోవడం ఎక్కువ భావస్ఫూరకంగా వుంది.

బుద్ధి కుశలత అంటూ వుంది. యుక్తిగా వుండడం వుంది. అదంతా ధీశక్తి. ప్రతి మానవునికి కొద్దో గొప్పో ధీశక్తి వుంది. కాని మానవత్వానికి

కావల్సింది వకీలు తెలివి కాదు, వివేకవంతమైన తెలివి. వొకరిని వోడించేది, అధి గమించేది కాదు. వకరిని కలుపు కొనేది. ఔదార్యం వహించేది కావాలి. ఆ గుణం హృదయానికి వుంది. అది బుద్ధిలో సమ్మిశతమైనపుడు సమృద్ధిగా వుంటుంది.

భౌతిక అవసరాలకు ఎంతో తెలివి కావాలి, జ్ఞాపక శక్తి కావాలి. వాటిని మానసిక అవసరాలకు, తృప్తికి వాడడంలోనే బాధ వుంది. అపుడు బోధ||ఆచరణ అనే విభాగం యేర్పడి ప్రమాదానికి దారి తీస్తుంది. కనుక మానసికంగా కావలసింది వివేకం, అవగాహన.

బౌద్ధంలో "ప్రజ్ఞ" అను పదం వాడబడింది. అంటే తెలివి అని అర్థం. ప్రతి దానికి తెలివి కావాలి. కాని వొట్టి తెలివి సరిపోదు. ప్రతి మనిషికి నీతి కావాలి. కాని వొట్టినీతి సరిపోదు. తెలివిగా ఆ నీతిని అనుసరించాలి. నీతిగా తెలివి కలిగి వుండాలి. నీతిని "పారమిత" అన్నారు. తెలివిని "ప్రజ్ఞ" అన్నారు కనుక సమగ్ర మైంది "ప్రజ్ఞా పారమిత" మాత్రమే. ఒక పది నీతి సూత్రములను బుద్ధుడు ప్రజ్ఞను చేర్చమన్నాడు. అవి పది ప్రజ్ఞా పారమితులు. ప్రతివారు అనుసరించాలని బోధించాడు. ఈలా ప్రజ్ఞాపారమిత చాలా వివేకమైంది.

పుర్రెలో నిల్వవుండే తార్కిక బుద్ధి కాక, ఎప్పటికప్పుడు మెదడు కణాల్లో మార్పు వల్ల పుట్టె తెలివి (Intelligence) వొకటుందట. అది స్వచ్ఛమైన ఖాళీ మనసు నుండి మెరుస్తుందట. యే నమ్మకానికి, ఊహకు, ప్రలోభానికి, విభజనకు లోనుగాని స్థితి నుండి ఉత్పత్తి అవుతుందట. ప్రేమ నుండి పుడుతుందట. మైత్రి కలుగజేస్తుందట. ఆ తెలివి స్వానుభవ పూర్వకమైంది. అది చదువుల వల్ల, పద వుల వల్ల వచ్చేది కాదు. హృదయ సంపదవల్ల చేకూరుతుంది. స్వేచ్ఛకు, సమ దృష్టికి సంబంధించింది.

నిత్యం అలాంటి తెలివితో జీవించిన కృష్ణజీ అనుభవం - తెలివి గూర్చి ఏమంటారంటే.

## అనుభూతి

అనుభవం పొందడం యొక్క జ్ఞాపకమే అనుభూతి, అవునా? అనుభవం పొందుతుండడం ఆగిపోగానే అనుభూతి, ఫలం వుంటుంది. అనుభవం పొందే

టప్పుడు అనుభూతి లేదు; అనుభవం పొందేమన్న దాని స్మృతియే అనుభూతి. అను భవం పొందడం అనే స్థితి సన్నగిల్లగానే అనుభూతి మొదలవుతుంది. అనుభవం పొందడాన్ని అనగా జీవించడాన్ని అనుభూతి ఎప్పుడూ అడ్డగిస్తుంది. ఫలితాలకు అనుభూతులకు అంతం వుంది. కానీ అనుభవం పొందడం అంతం లేనిది. అంతం లేని దాన్ని జ్ఞాపకం అడ్డగించగానే ఫలితాలకు వెదకడం మొదలవుతుంది. మనస్సు, ఫలితం ఎప్పుడూ ధ్యేయాన్ని, ఉద్దేశాన్ని వెదుకుతుంది. అదే మరణం. అనుభవపరుడు లేనపుడు మరణం లేదు. అపుడు మాత్రమే అనంతమైనది వుంటుంది. (CL I-155)

ఆ స్థితిని ఎవరైనా చెప్పివుండాలి, లేక పొంది ఉండాలి, లేక పొందుతూ వుండాలి. అనుభవించుచూ వుండడం అనుభూతి కాదు, ఫలితం కాదు, దాన్ని గూర్చి ఆలోచించలేం. ఆలోచింపామూ అది జ్ఞాపిక మాత్రమే గాని, అనుభవించడం కాదు. చదివింది, విన్నది మళ్ళీ చెప్పవచ్చు, శబ్దం వస్తువు కాదు, శబ్దం, మరియు పునరుక్తి అనుభవస్థితిని ఆపేస్తుంది. ఆలోచన ఉన్నంతకాలం ఆ అనుభవ స్థితి వుండదు, ఆలోచన, ఫలితం, ప్రభావం, అనుభవస్థితిని తెలిసికోలేవు.

## ఆలోచన అంతమెలా అవుతుంది

యదార్థం చూడండి, తెలిసిందాని ఫలితమే ఆలోచన. అది అనుభవస్థితి ఎప్పుడూ కాదు. అనుభవించడం ఎప్పుడూ కొత్తదే. ఆలోచించటం ఎప్పుడూ పాత దాన్ని బట్టే. వాస్తవం చూడండి, ఆలోచన నుండి అంటే ఫలితాన్నుండి సత్యం స్వేచ్ఛనిస్తుంది. అది స్పృహకు అవల వుంది. అది నిద్రించడం కాదు, మేల్కొ-వడం కాదు, అది నామరహితం, అదే. (CL I-159)

అనుభవం పొందుతున్న స్థితిలో అనుభం పొందేవాడూ లేడు, అనుభవం పొందబడడం లేదు. చెట్టు, కుక్క, నక్షత్రం అనుభవపరుని ద్వారా అనుభవం పొంద బడేవి కావు, అనుభవం పొందడమనే స్థితి గతిలో అవి వుంటాయి. పరిశీలకునికి పరిశీలనకాబడే దానికి మధ్య ఖాళీ లేదు. ఆలోచన లేదు, దేశకాల వ్యవధులు లేవు, ఆలో చనకు గుర్తింపే లేదు. అది పూర్తిగా లోపిస్తుంది. వునికి మాత్రం వుంటుంది. ఈ వునికి ఆలోచింప బడేది కాదు, ధ్యానించబడేది కాదు, అది పొందబడే వస్తువు కాదు, అనుభవం పొందడం నుండి అనుభవపరుడు వేరుగా వుండడం ఆగిపోవాలి, అప్పుడు వునికి మాత్రం వుంటుంది. ఆ ప్రసన్న గమనంలో కాలతీతమైంది వుంటుంది. (CL I-32)

అనుభవిస్తుండడం అనుభూతికి వేరైంది. అనుభవిస్తుండడం ఆలోచించేవాడి పరిధిలోనిది కాదు. అనుభవిస్తుండడం సన్నగిల్లినపుడు, అనుభవించేవాడు మిగుల్తాడు. అనుభూతి బహిర్గత మౌతుంది. తెలిసిన క్షేత్రంలోకి వస్తుంది. తెలిసినవాడు అనగా అనుభవించేవాడు అనుభవిస్తుండాలనే స్థితికై ఆరాట పడతాడు. కాని ఆ స్థితి తెలియంది. అపుడు అతను అనుభవిస్తుండే స్థితిలోనికి పోలేడు. భయపడతాడు. భయమై పోతాడు. భయానికి వేరైన వాడు కాదు. భయాన్ని అనుభవిస్తుండేవాడు. దాని పరిశీలకుడు కానేరడు. (CL II-61)

అనుభూతి ఎప్పుడూ గతంలోదే, అదే గతం. గతం వర్తమానాన్ని ఆసరా జేసికొని భవిష్యత్తులోకి ప్రాకుతుంది. భవిష్యత్తులోకి ప్రాకుతుంది. బహుశ కొంచెం మార్పు చెందినా భవిష్యత్తు కూడ గతమే. ఈ క్రియ మొత్తం ఆలోచనే, మనసే చేస్తుంది. కాలంలో తప్ప ఆలోచన దేనిలోను పని చేయదు. కాలాతీతమైన దాన్ని గూర్చి ఆలోచన వూహాగానం చేయవచ్చు, అయినా అది దాని నీడే. వూహాగానమంతా అజ్ఞానం. (CL I-232)

పాతది తన రూపాన్ని మాత్రమే గుర్తిస్తుంది. గుర్తించిన దాన్ని క్రొత్తది అనవచ్చును కాని, కాదు. కొత్తదాన్ని గుర్తించలేం. అది గుర్తింప బడనిది, కలిసి వుండనిది. పాతది క్రొత్తదాన్ని తెలిసికోలేదు. కొత్తది పాతదానిలోకి మార్పు చెంద వచ్చు, కాని కొత్తది పాతదాంతో వుండలేదు.

కొత్తది అనుభవం చెందుచుండడమంటే పాతది లేకపోవడం అనుభూతి, దాని ప్రకటన కూడ ఆలోచనయే, అభిప్రాయమే. ఆలోచన కొత్తదాన్ని పాత శబ్దాల్లోకి మారుస్తుంది. కొనసాగేది పాతదే. పాతది స్మృతి, శబ్దం, అదే కాలం.

దయచేసి వినండి. అవసరమైనా దాన్ని సహజంగా, ప్రయత్నం లేకుండా చేయగలదు. కోరికే ఆలోచన. కోరికే జ్ఞాపకాలు తెచ్చి పెడుతుంది. కోరికే ప్రయత్నం అంటే ఇచ్ఛ యొక్క చర్య. పోగుచేసికోవడమే కోరిక యొక్క విధానం. పోగు చేసికోవడమంటే కొనసాగడం. అనుభూతిని, జ్ఞానాన్ని, శక్తిని, వస్తువుల్ని పోగుచేసికోవడం, కొనసాగడాన్ని కల్పిస్తుంది. వాటిని కాదనడం వ్యతిరేకతను కొనసాగించడ మవుతుంది. అనుకూలమైనా, వ్యతిరేకమైనా, ఋణాత్మకమైనా, ధనాత్మకమైనా రెండూ కొనసాగడమే, రెండూ వొకే రకం. ఎక్కువగాని, తక్కువగాని పోగు చేసికోవడాన్ని కేంద్రం కోరిక. ఈ కేంద్రమే స్వార్థం. నిబద్ధీకరించబడిం దాన్ని బట్టి ఈ స్వార్థం అనేక స్థాయిల్లో వుంటుంది. మరింత పోగుచేసికోవడం

కేంద్రం యొక్క కార్యకలాపం. మనస్సు యొక్క గతి కాలబద్ధం. అది సృజనకు (CREATION) అడ్డు తగుల్తుంది. కాలాతీతమైన దాన్ని స్మృతితోను, అనుభూతి తోను కొలవలేం. అనుభూతి, జ్ఞానం పూర్తిగా తొలగినపుడు నామరహితమైంది వుంటుంది. సత్యం మాత్రమే మనస్సుకు ఆ బంధం నుండి తొలగిస్తుంది.

(CL I-108)

ఒకడు ఒక స్థాయిలో సామాజిక నిబద్ధతనుబట్టి దేవుణ్ని నమ్ముతాడు. మరొక విధంగా నిబద్ధమైనవాడు దేవుడు లేడని నమ్ముతాడు. అతడు వేరే సిద్ధాంతాన్ని నమ్మడానికి నిబద్ధించబడ్డాడు. ఎవరి నమ్మకాల చొప్పున వాళ్ళు అనుభవం పొందుతారు. ఆ అనుభవం తెలియనిదాని పట్ల అవరోధం అవుతుంది. అనుభవం, జ్ఞానం, అదే స్మృతి ఒక స్థాయిలో అవసరం. కాని అనుభవం మానసికమైన "నేను" అనే అహంకారాన్ని బలపరిస్తే భ్రమకు, దుఃఖానికి దారితీస్తుంది. మనస్సు అనుభూతులతో, జ్ఞాపకాలతో, జ్ఞానంలో నిండిపోతే మనం ఏం తెలిసికోగలం? తెలిస్తే అనుభవించడం వుంటుందా? తెలిసింది అనుభవించడాన్ని ఆపదా? పువ్వు పేరు తెలియవచ్చు. దాని ద్వారా పువ్వును అనుభవించగలవా? అనుభవించడం ముందు వుంటుంది. పేరు పెట్టడం అనుభూతికి బలాన్నిస్తుంది. పేరు పెట్టడం మరల అనుభవించడాన్ని అడ్డుకుంటుంది. పేరు పెట్టడం నుండి, అసోసియేషన్ నుండి, జ్ఞాపకాల ప్రక్రియ నుండి అనుభవించడమనే స్థితి స్వేచ్ఛగా వుండొద్దా? (CL I-208)

ప్రస్తుతస్థితి, మనస్సు పేరు వేరు ప్రక్రియలు కావు. కాని పేరు పెట్టడం వేరు చేస్తుంది. ఈ పేరు పెట్టడం లేకపోతే ముఖాముఖి సంబంధం వుంటుంది. మనస్సు "వున్న స్థితి" పొక్కపే, ఆ స్థితి పేరు పెట్టకుండ పరిశీలించడం. అప్పుడే ఆ వున్న స్థితి పరిణతి చెందుతుంది. అదీ భయం వగైరాలతో కూడిన శూన్యం కాదు. మనస్సు అనుభవిస్తున్న స్థితిలో వుంటుంది. అపుడు అనుభవించేవాడు అనుభవించబడేది వుండవు, కొలిచేవాడు లేడు కనుక అగాధమైన లోతు వుంటుంది. లోతుగా వున్నట్టిది నిశ్శబ్దం, ప్రసన్నత. ఆ ప్రసన్నత అనంతమైన దాని పూట. మనస్సు పదం వాడడం దగ్గిరే ఆందోళన పడుతుంది. పదం లేనపుడు ఆ ప్రమేయమైంది వుంది. (CL I-229)

నీవు వేరు, నీ గుణాలు వేరు, నీ భయాలు వేరు అనుకుంటావు. నీవూ నీ ఆలోచనలు, వుద్రేకాలు ఒకటి కదా, నీవే నీ ఆలోచనలు. "నీవు" అనే వేరే దాన్ని నీ ఆలోచనలే కలగ జేస్తాయి. ఆలోచన లేనిదే ఆలోచనా పరుడు లేడు.

ఆలోచన ఎల్లకాలం వుండదు కనుక శాశ్వతంగా వుండే ఆలోచనా పరుని సృష్టిస్తుంది. ఏదో శాశ్వతత్వం కోసం మనం తాపత్రయ పడడమే అందుకు కారణం. ఆ యాలోచనా పరుడే అనుభవజ్ఞుడౌతాడు, విశ్లేషకుడు, పరిశీలకుడు అవుతాడు. మార్పు చెందేదాన్నుండి వేరౌతాడు. అలాగే ఆత్మను, వున్నతాత్మను, పరమాత్మను అలా శాశ్వతంగా వుండే వున్నత స్థితులను సృష్టిస్తాడు. ఈ మొత్తం నిర్మాణానికి ఆలోచనే ప్రాతిపదిక. (సారాంశం: CL II-16)

అనుభూతివల్ల, అనుభవజ్ఞుడు నిరంతరం నిబద్ధుడౌతాడు. అనుభూతి పరుడు అనుభూతి పొందుతున్నట్లు ఎరిగితే ఆ యనుభవం సొంత కోర్కె రూపమే. భగవాధనుభూతి పొందుచున్నట్లు తెలిస్తే ఆ భగవంతుడు నీ ఆశల యొక్క, భ్రాంతులయొక్క రూపమే. అనుభూతి పరునికి స్వేచ్ఛలేదు. ఎప్పటికీ సొంత అనుభూతుల్లో తగుల్కుంటాడు. కాలాన్ని సృష్టించేదతడే, శాశ్వతమైన దాని అనుభవం ఎన్నటికీ పొందలేడు. (CL II-114)

బౌద్ధానికిగాని, క్రైస్తవానికిగాని నిబద్ధం అయితే నీ మనస్సు చేసే పని నీకు తెలియదు. ఆ యనుభూతికి నీవు బంధీవి. కాని స్వయం జ్ఞానం (Self-Knowledge) వుంటే అనుభూతులు గుర్తింప బడతాయి. తన్ను తాను తెలిసికోవడం (Self-Knowing) బంధ విముక్తిని చేస్తుంది, సమగ్రతను కూరుస్తుంది. స్వకీయ జ్ఞానం లేకుంటే అనుభూతి బరువౌతుంది, అన్ని భ్రాంతులకు దారితీస్తుంది. (CL II-132)

జ్ఞాపకాల్లో చిక్కుకుపోతే ప్రవాహం లాంటి జీవితాన్ని అందుకోలేవు. జ్ఞానం అనుభూతికి స్మృతికి, ఇంకా భారం. అందుచే అవి క్రమంగా జీవితాన్ని క్షీణింప చేస్తాయి. (సారాంశం: LH-115)

అసూయలాగానే అనుభూతి కూడా లోతుగా పాతుకొన్న జ్ఞాపకం. అది వినాశనాత్మకం. రోజు వారీ వాస్తవాలు మరచిపోమనడం లేదు. అనుభవం వద్దు అనడం లేదు. అలాకాదు. అనుభూతులతో నిండిపోయిన మనిషి వివేకి కాడు. అనుభవం పొంది దాంతో ముడిపడ్డవాడు తెలివిగలవాడు కాదు. పుస్తకాలు చదివి సమాచారం సేకరించే విద్యార్థిలాంటి వాడు. వివేకి అమాయకంగా వుంటాడు, అనుభూతి నుండి విడుదలౌతాడు. అంతర్గతంగా, సరళంగా వుంటాడు, ప్రాపంచికమైనవి ఎన్ని వున్నా లేకపోయినా. (LH-116)

జ్ఞానాన్ని, అనుభవాన్ని ఇంకా ఇంకా నిల్వజేస్తూ వుంటే "అధికం" అవుతూ వుంటుంది. ఆ అధికమే ప్రోగుచేసే మనో కేంద్రం అదే "నేను" అదే "అహం" అదే ముసుగులోని "ఆత్మ" అనుభవాల పుట్టతో జీవితాన్నెదుర్కోవడ మంటే అధికానికి మనస్సు అలవడడమే, మనస్సు కేవలం సంగ్రహించే పరికరం అయితే నిజంగా అనుభవించటం అంటూ వుండదు. అనుభూతినుండి ఏదో పొందా లనే కాంక్ష వున్నప్పుడు అనుభవాని కెలా సిద్ధం కాగలవు? (LH-140)

మనం సమస్యలోకి పోవాలి, అవగాహన కావాలి. అంతేగాని ఎంతో జ్ఞానం హోదా, పేరు ప్రఖ్యాతులు సంపాదించారన్నంత మాత్రాన ఎవర్నీ గౌరవించ రాదు. మనకు తెలిసింది చాలా తక్కువ. పుస్తకాలెన్నైనా చదవవచ్చు. ప్రత్యక్షాను భవం పొందు చుండడం చాలా తక్కువ. దైవంగాని, సత్యంగాని, ప్రత్యక్షంగా అనుభూతి చెందుచుండడం ముఖ్యం. అందుకు పేరు అవసరం.

(సారాంశం: LH-94)

పగలంతా జరిగింది రాత్రి పడుకోబోయే ముందు దృష్టిలోకి తెచ్చుకొని గమనించి క్రమత వహిస్తే నిద్రలో వాటిని సరిచేయాలని మనస్సు ప్రయత్నించదు, గమనించడ మంటే లోపల, బయట వున్న క్రూరత్వాన్ని, అలక్ష్యాన్నీ, కల్మషాన్ని కలహాన్ని, నిరాదరణను, రాజకీయ వేత్తల మతఅబిల్ని, భార్యతో, భర్తతో ఆడ మగ స్నేహితులతో వుండే సంబంధాన్ని, ఉన్నదున్నట్లుగా సరిచేయాలని ప్రయ త్నించకుండా-స్పష్టంగా ఎరిగివుండడం, అపుడున్న స్థితే క్రమత (Order)

(A I-63)

మన ఆధ్యాత్మిక భావాతీత అనుభూతులనుగూర్చి మాట్లాడడమంటే అది నీకు ముందే తెలిసిందన్నమాట. తెలిసిందాన్ని గుర్తించడానికి మామూలు అనుభ వానికి వేరైంది పొందుతున్నావు. తార్కికంగా చూస్తే మనస్సు అనుభూతిని గుర్తిం చాలన్న మాట. గుర్తింపు అంటే ముందుగానే తెలిసింది కదా, కనుక అది కొత్తది కాదు.

(A I-91)

తర్కం ఎప్పుడూ నిజమని కాదు, కాని తర్కాన్ని హేతువును ఆరోగ్య ప్రదంగా, తెలివిగా వాడితే హేతువు పరిమితులు తెలుస్తాయి. పెద్ద పెద్ద లోతైన ప్రాథమిక అనుభూతులకు పెరపెర లాడడం, తెలిసిన మార్గాన్ని పొడిగించ డమే అవుతుంది. ఈ విషయం పంచుకోవాలి, హృదయాలకు పరస్పరం అందాలి.

(A I-92)

ప్రశ్నించే మనస్సు-కోరే మనస్సు కాదు- అనుభవ కాంక్షనుండి, సత్యాన్వేషణ నుండి విముక్తి కావాలి. ఎందుకో తెలుసా, వెదికేటప్పుడు అనేకమంది బోధకుల్ని ఆశ్రయిస్తావు. అనేక పుస్తకాలు చదువుతావు. అనేక సంప్రదాయాల్లో చేరుతావు. అనేక మంది గురువులను అనుసరిస్తావు· బజారుకొనుగోలుకు వెళ్ళినట్లు ఇక ఆ తతంగమంతా చేస్తావు. అలాంటి అన్వేషణకు అర్థమే లేదు. (AD-92)

ఆలోచనను అదుపులో పెట్టడం కాదు. అవగాహన ముఖ్యం. ఆలోచన యొక్క మూలాన్ని గ్రహించాలి. అది నీలో వుంది, మెదడు జ్ఞాపకాల్ని నిల్వ చేస్తుంది. ఆలోచించడానికి పుస్తకాలు చదవక్కరలేదు, జ్ఞాపకం అనేది అనుభూతి ఫలితం. అది నీది కావచ్చు, సమాజానిది కావచ్చు,కుటుంబాన్ది కావచ్చు,జాతిది కావచ్చు, ఏదైనాకావచ్చు, ఆ జ్ఞాపకాల గిడ్డంగి నుండిఆలోచన లేస్తుంది. ఆలోచనకు ఎప్పుడూ స్వేచ్ఛలేదు. అదెప్పుడూ పాతదే. ఆలోచనా స్వేచ్ఛ (FREEDOM OF THOUGHT) అనే దేమీ లేదు. స్వేచ్ఛను గూర్చి మాట్లాడగలదు కాని, దానికది స్వేచ్ఛగా వుండదు. అది గతానుభవాలయొక్క, జ్ఞాపకాలయొక్క, జ్ఞానం యొక్క ఫలమే జ్ఞానం లేకపోతే అది పనిచేయదు, ఎవరూ ఎవరితోనూ మాట్లాడలేరు. ఇంటికి వెళ్ళలేరు, అందుకని జ్ఞానం అవసరం.

అయితే జ్ఞానం పనిచేసే విధానాన్ని అవగాహన చేసికొన్నపుడు స్వేచ్ఛ వుంటుంది. జ్ఞాన విముక్తి కలుగుతుంది. (A I-96)

మొదట చూడడం జరుగుతుంది, తరువాత అనుభవించడం వుంటుంది. అపుడు ఆలోచన జ్ఞాపకంగా రికార్డు కాకుండా వుందా?ఇది అవగాహనకు వొచ్చిందా? శబ్దం, అర్థం, వివరణ, విశ్లేషణ వున్నాయి, అది వొక అవసరమైన ప్రక్రియ. అనవసరమైంది, అసందర్భమైంది దాని తీర్మానం. సరే ఆలోచనలోకి, వివరణల్లోకి, విశ్లేషణలోకి, అర్థంలోనికి, శబ్దంలోకి తర్జుమా కాని శబ్దరహితమైనదాన్ని అనుభవించడం వుందా?

మెదడు కణాలు దాన్ని రిజిష్టరు చేస్తాయా? చేస్తే జ్ఞాపకం అవుతుంది. అప్పుడది "నేను అనుభవించాను" అంటుంది. చూడడం, లోతుగా పరిశీలించడం, శబ్దరహిత మయిందాన్ని వినడం వుందా? అది మెదడు కణాల్లో రిజిష్టరు అవుతుందా? శబ్దరహితమైంది అనుభూతికి వస్తుందా?

ఇది చూడగలిగితే ఒక స్థితి వుంటుంది. అది వివేకానికి సంబంధించింది. అది అనుభూతిని రిజిష్టరు కానివ్వదు, (TR -D28)

కాంక్ష, బంధం వున్నపుడు ఆత్మవంచన వుంటుంది. ఈ బంధం పక్షపాతమైంది. అనుభవానికి, ఒక ఆలోచనా విధానానికి సంబంధించింది. కావాలని అనుభవపరుడు ఎప్పుడూ, గొప్పదైన, లోతైన, పెద్దదైన అనుభవాన్ని కాంక్షిస్తుంటాడు. అనుభవపరుడున్నంతకాలం ఏదో రూపంలో భ్రమ తప్పదు. (CL III-8)

## తెలివి

తెలివి అంటే ఏమిటి అని అడుగుతున్నాం. అభ్యాసంతో తెలివి వస్తుందా? తెలివి సహజమైంది (INNATE) ఘర్షణ విభాగం మొదలగు వాటిని ఆలోచన చూడగలదా, వాస్తవాన్ని గ్రహించడం, దాంతో ప్రశాంతంగా వుండడం మనసు యొక్క గుణమా, అంటే మార్పుచేయాలని అతిక్రమించాలని లేకుండా పూర్తిగా నిశ్చలంగా వాస్తవంలో వుండడం మనస్సు గుణమా? ఆ నిశ్చలతే తెలివి. తెలివి అంటే ఆలోచన కాదు. ఈ మౌనమే తెలివి. కనుక అది వ్యక్తిగతమైంది కాదు. అది ఏ గ్రూపుకు, ఏ వ్యక్తికి, ఏ జాతికి, ఏ సంస్కృతికి చెందినది కాదు. (A I-373)

వాస్తవంతో ప్రశాంతంగా వుండడమే తెలివి. ఆ తెలివి ఆలోచనలో పని చేస్తుంది. జ్ఞానాన్ని,ఉపయోగించుకుంటుంది. అలాంటి జ్ఞానం, ఆలోచనా విభాగాన్ని సృష్టించదు. (A I-374)

ఆలోచన కాల సంబంధమైంది, తెలివి అలా కాదు. తెలివి కొలవరానిది. తెలివి అంటే సాంకేతిక జ్ఞానం కాదు. గృహిణి విజ్ఞానం కాదు. విజ్ఞాని తెలివితేటలు కాదు. ఇవన్నీ ఆలోచనకు, జ్ఞానానికి సంబంధించిన క్షేత్రంలోనికి, మనసు స్థిమితంగా వుండగలదు. అందుకు నీవు ప్రాక్టీసు చేయనవసరం లేదు. కంట్రోల్ చేయనవసరం లేదు. అది పూర్తిగా స్థిమిత పడగలదు. అలాంటప్పుడు సామరస్యం (HARMONY=పొందిక) వుంటుంది. అక్కడ విశాల దేశం, నిశ్శబ్దంగా ఉంటాము. అపుడు మాత్రమే కొలవరానిది ఉంటుంది. (A I-375)

తెలివి వ్యక్తిగతమైంది కాదు. వాదనవల్ల వచ్చేది కాదు. నమ్మకంవల్ల గాని, అభిప్రాయవవల్ల వచ్చేదిగాని, రీజనువల్ల వచ్చేదిగాని కాదు. మెదడు తన లోటు పాటును గ్రహించినపుడు తన సామర్థ్యమును గుర్తించి నపుడు తెలివికలుగుతుంది. ఆ తెలివి కొత్త పరిమాణంలో (NEW DIMENSION) ఎలాంటి సంబంధం ఉంటుంది? "సంబంధం" అనే పదం వాడను. (A I-412)

పాత మెదడు వున్నంతసేపు తెలివి పనిచేయదు. నమ్మకం ఏ రూపంలో ఉన్నా అవి పనిచేయవు. మెదడు యొక్క ఏ కొద్ది విభాగంతో సంబంధం వున్నా అది పనిచేయదు. అదంతా తెలివి లేకపోవడమే. దేవుని నమ్మేవాడు తెలివిగలవాడు కాదు. "ఒకే రక్షకుడున్నాడు" అనే మనిషికూడ తెలివి మంతుడు కాదు. "ఈ మతాకి చెందినాను" అనే వాడు కూడ తెలివి వున్నవాడు కాదు, పాతదాని యొక్క పరిమితులు కనిపెట్టినపుడు, ఈ కనిపెట్టడమే తెలివి అవుతుంది. ఆ తెలివి పనిచేస్తున్నపుడు కొత్త పరిమాణం దాని ద్వారా ఉంటుంది. అదంతే, వచ్చిందా?

(A I-412)

స్పష్టంగా చూడడానికి మనస్సు ఖాళీగా ఉండాలి. అప్రమేయమైనదానికి అనగా తెలియని దానికి, తెలిసినదానికి మధ్య సంబంధం ఈ తెలివి. దానికి బౌద్ధంతోను జెన్ (ZEN) తోను, నాతోను, మీ తోను పని లేదు. అధికారంతోను, సంస్కృతి తోను పనిలేదు. ఆ తెలివి మీకు లభించిందా? అవసరమైన అంశం (పాయింటు) అదొక్కటే, ఈ లోకంలో తెలివి నీతిగా పనిచేస్తుంది. నీతి అనేది అపుడు క్రమత అవుతుంది. అదే సన్మార్గం (VIRTUE) అది సమాజం యొక్క సన్మార్గమూ కాదు, నీతికాదు. సమాజానికి సంబంధించిన సన్మార్గం పూర్తిగా అవినీతి మయమైయింది.

(A I-499)

ప్రొఫెసర్ బోమ్ : (INTELLIGENCE) అనే పదం (INTER) మరియు (LEGERE) అనే శబ్దాల నుండి ఏర్పడింది. అంటే (TO READ BETWEEN) లేక (BETWEEN THE LINES) రెండు లైన్ల మధ్య ఏముందో చదవడం, అంత-రార్థం గ్రహించడం. కనుక ఆలోచన పుస్తక సమాచారం లాంటిది తెలివి. దాన్ని చదవడం దాని తాత్పర్యం తెలిసికోవడం, తెలివికి చక్కని నిర్వచనం అనుకుంటా. (A I-509)

ఆలోచన పాత మెదడులో పుడుతుంది. అది భౌతిక ప్రక్రియ, విద్యుత్ రసాయనిక చర్య (ELECTRO CHEMICAL) తెలివి దీనికి వేరైంది కావాలి. కాలానికి సంబంధించింది కాదు. యాంత్రికం కాదు. (A I-510)

కృ :- ఆలోచనను కొలవవచ్చు, తెలివిని కొలవలేం. తెలివితో ఆలోచనకు సంబంధం లేకుంటే, ఆలోచనారాహిత్యమే తెలివిని మేల్కొల్పడం అవుతుంది. ఆలోచనతోను, కాలంతోను సంబంధం లేనిది కనుక తెలివి ఎప్పుడూ ఉంటుంది.

(A I-510)

బోమ్:- ఉండొచ్చు, ఉండక పోవచ్చు. ఏదైనా తెలివికి అంతరాయం కలుగ జేయవచ్చు. (A I-511)

కృ :- హైందవ సిద్ధాంతం ఉంది. తెలివి, బ్రహ్మ ఎల్లపుడూ ఉంది. మాయతో, అజ్ఞానంతో, ఆలోచన సృష్టించిన అన్నిటితో కప్పబడి ఉంది........ వాటిని తొలగిస్తే అది ఉంటుంది అంటారు. కనుక అది ఎల్లప్పుడూ ఉందని వూహించారు. (A I-511)

తెలివి కలిగించే చదువు చెప్పొద్దా? అన్ని సమస్యలను అదే కదా తీర్చేది. స్వేచ్ఛగా, నిర్భయంగా, సూత్రం ద్వారా రాకుండా ఆలోచించే సామర్థ్యమే తెలివి, తద్వారా నీకు నువ్వే నిజమేదో, యదార్థమేదో తెలిసికుంటావు. భయపెడితే తెలివిగా ఉండలేవు. అధ్యాత్మికమైంది కాని, మామూలుది కాని ఏ కోర్కె అయినా ఆదుర్దాని, భయాన్ని తెచ్చిపెడుతుంది కనుక స్పష్టంగ, సరళంగ, సూటిగ కనుక తెలివిగ ఉండే మనస్సును కలుగజేయడానికి కోర్కె సాయపడదు.

తెలివిగల మనస్సుంటే పరిశీలించేది, గమనించేది, నేర్చుకొనేది, అధ్యయనం చేసేది. అంటే ఏమిటి? భయంలేనపుడు, తిరగబడ్డానికి ఇష్టపడ్డపుడు దైవాన్నో, ఏ సత్యాన్నైనా కనుగొనడానికి సమాజం మొత్తాన్ని వ్యతిరేకించినపుడు తెలివి వుంటుంది. (TMC-19)

నిన్ను నువ్వే అవగాహన చేసికొన్నపుడు తెలివి వస్తుంది. మనుషులు, వస్తువులు, అభిప్రాయాలతో కూడిన ప్రపంచముతో నీకున్న సంబంధంలో నిన్ను నీవు అర్థం చేసుకోవాలి చదువులాగ తెలివి సంపాదించేది కాదు. ఎదురు తిరగటం తోను, భయం లేనపుడు అనగా నిజంగా ప్రేమభావం వున్నపుడు తెలివి కలుగుతుంది. భయం లేనపుడే ప్రేమ వుంటుంది. (TMC-20)

నేను బుద్ధిహీనంగా వుండే తెలివి గల వాణ్ణి కావాలనుకుంటే ఆ ప్రయత్నం మరింత బుద్ధిహీనత కలుగజేస్తుంది ఎందుకంటే బుద్ధిహీనతను అర్థం చేసికోవడం ప్రధానం. నేను ఎంత ప్రయత్నించినా బుద్ధిహీనతే మిగుల్తుంది, చదువుల పైపై మెరుగు పొందివుండవచ్చు, పుస్తకాలు ఉదహరించవచ్చు, గొప్పరచయితల వాక్యాలు ఉచ్చరించవచ్చు, అయినా మౌలికంగా నేనింకా బుద్ధిహీనుణ్ణే. కాని బుద్ధిహీనత నా

నిత్యజీవితంలో ఎలా బహిర్గతమౌతుందో, నా పనివాడి పట్ల ఎలా ప్రవర్తిస్తున్నానో, పొరుగు వాన్ని, పేదవాన్ని, ధనికుణ్ణి, ఎలా గౌరవిస్తున్నానో చూసి అవగాహన చేసి కుంటే ఆ ఎరుకే నా బుద్ధిహీనతను పటాపంచలు చేయగలదు. (TMC - 20)

నీవు మందంగా వుంటే తెలివిగానో, యుక్తిగానో వుండాలని ప్రయత్నించకు. నిన్ను మందకొడిగా చేస్తున్న దేమిటో అర్థం చేసికో. అనుకరణ, భయం, ఎవరినో అనుసరించడం, ఒక ఆదర్శాన్ని ఉదాహరణను అనుసరించడం, ఇవి మనస్సును మందగింపజేసేవి. వాటినుండి బయటపడితే, సొంతంగా, స్పష్టంగా నీకు నీవు ఆలో చించే సామర్థ్యం పొందితే నీవు మానవ మాత్రుల్లో ఎక్కువ వికాసవంతుడవు కావా? మొద్దుగావుండి బుద్ధిజీవిని కావాలిస్తే, బుద్ధి వుండి, బాగా మొద్దుగవుంటే పెద్దలలో చేరిపోతావ్. (TMC - 122)

నీ మొత్తం జీవితంలో ఏం చేయాలను కుంటున్నావో నీకు నీవు నిజంగా కనుగొనక పోతే, శ్రద్ధ లేని పనిలో తగుల్కొంటావు. దాంతో జీవితం దుఃఖ మయంగా వుండడంతో ప్రక్కదారిని పడతావు, సినిమాలు, త్రాగుడు, లెక్కలేనన్ని పుస్తకాలు చదవడం, ఏదో రకం సంఘ సంస్కరణో అదో ఇదో చేయాలనడం - మొదలగు వాటికి లోబడతావ్. (TMC-214)

ప్రతి క్రియగాని తెలివిగల తిరుగుబాటు వుంది, అది తనకు తాను తెలిసి కోవడంద్వారా, తన ఆలోచనను, భావాల్ని ఎరగడం ద్వారా వస్తుంది. వచ్చే అను భవానికి ప్రత్యక్షంగా వుండి, అలజడిని తొలగించాలని లేకుండా వుంటే తెలివిని మేల్కొల్ప చేస్తాం. అలా మేల్కొన్నది లోనుండి వచ్చింది (INTUITION) జీవితంలో అదే నిజమైన మార్గదర్శి. (ESL-)

సమగ్రమైనట్టి కనుక తెలివిగలట్టి వాళ్ళను తయారు చేయడం చదువు యొక్కపని. తెలివి లేకయే పట్టాలు, (డిగ్రీలు) పుచ్చుకొని యాంత్రికముగా సామర్థ్యం సంపాదింపవచ్చు. తెలివి అంటే కేవలం సమాచారం కాదు. పుస్తకాల నుంచి సేకరించింది కాదు. స్వయం సమర్థనీయమైన యుక్తితో కూడిన ప్రతి స్పందన వల్ల రాదు. పిల్లలను సమగ్రమైన స్త్రీ పురుషులుగా తయారవడానికి అడ్డ గిస్తాం, అందుచే వాళ్లు తెలివిగా ఆలోచించడానికి సామర్థ్యం వుండదు. ఆ తెలివి జీవితాన్ని మొత్తంగా చూడగలదు. (ESC)

ప్రేమ తెలివి వున్నపుడే బహిరంగంగా భద్రత వుంటుంది. కాని మనం సృష్టించిన ఘర్షణ వల్ల దుఃఖంతో కూడిన ప్రపంచములో భద్రత అసాధ్యమై పోతుంది. గతంలో వున్నట్టి, ప్రస్తుతం వున్నట్టి, విద్యావిధానం వృథా అయిందని తెలుస్తుంది. సాంప్రదాయిక ఆలోచనల నుండి విరమించు కోవాలి. (ESL)

తెలివి అంటే పరీక్షలు పాసుగావడంతో లేదు. అది సహజధోరణిలో వుండే లోలోతు పరిశీలన. అది మనిషికి బలాన్ని, స్వేచ్ఛను ఇస్తుంది. పిల్లవాడిలో తెలివిని మేల్కొల్పాలంటే తెలివి అంటే ఏమిటో మనం అవగాహన చేసికోవాలి. అనేక రీతులుగ మనం తెలివి లేకుండ వుండి పిల్లవాణ్ణి తెలివిగా ఎలా వుండమనగలం? పిల్లవాడి ఇబ్బందులే కాదు మన సమస్య, మనవి కూడ నిల్వాన్న భయాలు, అసౌఖ్యం, నిరుత్సాహం, మొదలగునవి. మనల్ని మందగొడి, ఆలోచనలేని వాళ్ళను చేసే అడ్డంకులు ముందు మనం తొలగించుకోవాలి. (ESL)

బుద్ధి - అదే మనస్సు - వల్లించ గలదు, గుర్తుకు తెచ్చుకో గలదు. ఎప్పుడూ క్రొత్తపదాలు అల్లుతుంది. పాతవి తిరిగి అమరుస్తుంది అది మనలో ఎక్కువ మంది బుద్ధి ద్వారా భావించి, అనుభవిస్తున్నట్లు మనం కేవలం మాటల మీద యాంత్రిక పునరుశ్చరణ మీద బ్రతుకుతాం. ఇది సృజన కాదు - మనకున్న సృజ నాత్మకం అంతా లైంగికం. అది మనసుకు సంబంధించింది (మనసుకు సంబంధించింది) దాని కది నెరవేరాలి లేకపోతే నిరుత్సాహమే. (ESL)

తెలివిని దేపుడని తర్జుమా చేయవద్దు. ఇపుడు తెలివి జ్ఞానాన్ని వాడగలదు. తెలివి ఆలోచనను వాడగలదు. జ్ఞానం అను క్షేత్రంలో ఆలోచన పనిచేస్తుంది. అపుడు తెలివి జ్ఞానాన్ని వాడవచ్చు. దాని పని ద్వంద్వంగా వుండదు. (TR-D27)

విభజనాత్మకమైన మనస్సు తెలివిగా వుండలేదు. (WL-22)

లోదృష్టే తెలివి. నీది కాదు, నాదీ కాదు. అది ప్రపంచం మొత్తానిది. దుఃఖం లోకి కూడ చూడు. ఆ లోదృష్టినుండి కరుణ వస్తుంది. కరుణలోకి చూడు. దాన్ని ఏదీ అంటలేదు. (WL-135)

ఏకత్వం అంటే అన్నిటితో ఒకటిగా వుండడం. అది మానవత్వానికే ప్రతీక. చైతన్యం ద్వారా, పరిశీలన ద్వారా మార్పుచెందితే అది తెలివిని మేల్కొల్పడం, మానసిక అధికారాన్ని అది తొలగిస్తుంది. (WL-148)

లోదృష్టి స్పష్టంగా వుండడమే తెలివి. అందులో అసాధరణ భద్రత వుంది. అంటే నీవు భద్రత చెందడం కాదు. తెలివి భద్రంగా వుండటం.

(సారాంశం : WL-166)

మేల్కొన్న తెలివికి నిజమైన లోదృష్టి వుంది. మానసిక సమస్యలు, విపత్తులు, అవరోధాలు మున్నగు వాటిలోకి చూడగలదు. అది బుద్ధితో అవగాహన చేసికోవడం కాదు, సమస్యలను ఘర్షణతో పరిష్కారం చేయడం కాదు. మానవ సమస్యలోకి దృష్టి సారించడం తెలివిని మేల్కొల్పడం అవుతుంది. లేక ఈ తెలివి వుండడం అంటే లోచూపు వుందన్నమాట. రెండు విధాల వుంటుంది. అలాంటి అంతర దృష్టిలో ఘర్షణ లేదు. దేనినైనా స్పష్టంగా చూసినపుడు, వస్తువును సత్యాన్ని చూచినపుడు దాంతో సరి. దాంతో పోరాడవు, కంట్రోల్ చేయడానికి ప్రయత్నించవు. లెక్క ప్రకారం, వుద్దేశపూర్వకంగా రకరకాల ప్రయత్నాలు చేయవు. ఆ అంతరదృష్టివల్ల, అంటే తెలివివల్ల క్రియ వుంటుంది. వాయిదా వేయబడ్డ క్రియ కాదు, తక్షణ చర్య.

(WL-170)

పరిస్థితులకు, స్థిరపడ్డవాటికి (ESTABLISHMENT) ఆదర్శాలకి, వూహలకు (UTOPIA) మతాలకు, గురువులకు, సమాధానపడి, సర్దుకు పోదామనుకోకుండ అసంతృప్తి చెందితే ఒక జ్వాల వెలువడుతుంది, మండుతుంది అసంతృప్తి జ్వాల బయటపడే మార్గం లేదు కనుక ఆ జ్వాల ఒక గొప్ప ఆసక్తి అవుతుంది. ఆ ఆసక్తియే తెలివి. ఆ జ్వాలయొక్క తీవ్రత మనసుకు ఒక నాణ్యతనిస్తుంది. అది తక్షణం ఎంతో లోతుకు చూడకలుగుతుంది, దాని నుండి కార్యం మొదలవుతుంది.

(సారాంశం : WL - 178)

మానవుడు సృష్టించిన చెరలను ప్రక్కకు నెట్టకల్గితే అపుడుండే అద్భుతమైన అసంతృప్తి జ్వాల అత్యున్నతమైన తెలివిగా పరిణమిస్తుంది. అది అంతర దృష్టిని ఇస్తుంది, దాని నుండి తక్షణ చర్య బయలుదేరుతుంది.

(సారాంశం : WL-48)

సృజనాత్మకంగా వుండాలంటే అనగా నిజమైన ప్రోత్సాహం అన్నిటియెడ కలిగి వుండడానికి స్వేచ్ఛ వుండాలి. ఆ స్వేచ్ఛ నిమిత్తం తెలివి వుండాలి. తెలివిని

ఏది అవరోధిస్తుందో పరిశోధించి తెలుసుకోవాలి. జీవితాన్ని శోధించాలి. సామాజిక విలువల్ని ప్రశ్నించాలి. ప్రతిదాన్ని ప్రశ్నించాలి. ముక్కలు ముక్కలైన దేన్నీ అంగీకరించవద్దు. (LA-53)

జ్ఞానం, సమాచారం, అనుభూతి పొందడం వల్ల తెలివి కలుగు తుందని మనలో చాలమంది అనుకుంటారు. అపుడు జీవితాన్నెదుర్కో-వచ్చను కుంటారు. జీవితం అసాధారణమైంది. ఎప్పుడూ స్థిరంగా వుండేది కాదు. ఎక్కువ అనుభవం, ఎక్కువ జ్ఞానం, ఎక్కువ పుణ్యం, ఎక్కువ ధనం, ఎక్కువ సంపాదనలు, సేకరించడంవల్ల తెలివిగా వుంటారని అనుకుంటాం. అందుకే మనం జ్ఞానం కూడబెట్టిన వార్ని, పండితుల్ని, బాగా ధనవంతుల్ని, అనుభవజ్ఞుల్ని గౌరవిస్తాం. కాని "ఎక్కువ" నుండి వచ్చిందా తెలివి? ఎక్కువ కలిగి వుండే ప్రక్రియలో ఎక్కువ కావాలని కాంక్షించే ప్రక్రియలో ఏముంది? సంశయంతో ముడిపడడం కాదా? (LA-140)

ఇంకా ఇంకా కావాలనే మనిషి తాజాగా జీవితాన్ని అనుభవించలేడు "ఎక్కువ" తోను, సంశయం తోను సంబంధం లేని మనసుకు తెలివి వుండడానికి సాధ్యం. "ఎక్కువ"తో సంబంధం వున్నపుడు ప్రతి అదనపు అనుభూతి తనను కప్పేసే "నేను" అనే గోడను, అహంకార ప్రక్రియను బలపరుస్తుంది. అది అన్ని ఘర్షణలకు కేంద్రం. దయచేసి ఇది గ్రహించండి. అనుభూతి స్వేచ్ఛ నివ్వలేదా అది స్వార్థపూరిత ఆలోచనా ప్రక్రియను బలపరుస్తుంది. (LH-141)

స్వార్థం నుండి "నేను" నుండి నిజమైన విముక్తి పొందినపుడే తెలివి వుంటుంది. ఎక్కువ యెడల మనసుకు కాంక్ష లేనపుడే తెలివి వుండడానికి వీలుంది. కాలం యొక్క వత్తిడి నుండి స్వేచ్ఛ పొందడం తెలివి. ఎందుకంటే ఎక్కువ అనేది కాలానికి సంబంధించింది. అది కాలం యొక్క ఫలమే. "ఎక్కువ" కొరకు కృషి చేయడం తెలివి కాదు. ఈ ప్రక్రియ అంతా అవగతం చేసికోవడం స్వయం జ్ఞానం. సంచయ కేంద్రం లేకుండ తనను తాను తెలిసికుంటే ఆ స్వయం - జ్ఞానం నుండి తెలివి వస్తుంది. అది జీవితాన్ని ఎదుర్కోగలదు. ఆ తెలివి సృజనాత్మకం. (LH-131)

సృజనాత్మకం అంటే కవితలు, కథలు, చిత్రాలు అల్లడం కాదు, పిల్లలు

కలగడం కాదు. లోతైన సృజన స్వభావం కనుగొన్నపుడు శాశ్వత ఆధారం దొరికినట్లు. అది ధారాపాతం, అంతం లేనిది. అది తెలివి ద్వారానే కనుగొన సాధ్యం. దానికి కాలం ఆధారభూతం కాదు. "నేను" "స్వార్థం" కేంద్రంగా వున్న మనస్సు ఆ కాలం లేనిదాన్ని కనుగొనలేదు. అహం ఎప్పుడూ ఇంకా ఇంకా కావాలంటుంది. (LH-141)

ఇదంతా శబ్దపరంగా కాకుండా లోతుగా అవగాహన చేసికుంటే, మేల్కొన్న తెలివి ద్వారా సృజన శక్తి వస్తుంది. అదే యదార్థమైంది. అదే దైవం, చింతించ తగింది కాదు. ధ్యానించ తగింది కాదు. సాధన ద్వారా, ధ్యానము ద్వారా ఎన్నటికి రాదు. ఇంకా కావాలనే ప్రార్థనల ద్వారా రాదు. ఎక్కువల నుండి తప్పించుకుండా మనడం వల్ల కూడ రాదు. ప్రతిరోజూ, క్షణ క్షణమూ లేచే క్లిష్టమైన ప్రతిక్రియలు అయిష్టత, ఈర్ష్య, మనోస్థితి అవగాహన చేసికుంటే ఆ యదార్థత పెల్లుబుకుతుంది. ఇవి అవగాహన చేసికోవడంలో ప్రేమ అనే స్థితి యేర్పడుతుంది. ఆ ప్రేమే తెలివి, అది కాలప్రమేయం లేని సృజనత్వాన్ని కల్గిస్తుంది. (LH-142)

అన్ని రకాలైన తీర్మానాలు ప్రజ్ఞా ప్రాభవాన్ని ఆపి వేస్తాయి. తెలివిలో మాత్రమే స్వేచ్ఛ వుంటుంది. స్వేచ్ఛలో మాత్రమే యదార్థత గోచరిస్తుంది. ఈ స్వేచ్ఛ లేనపుడు యుక్తిని (Cunning) తెలివి అనుకుంటాం. యుక్తి మార్గాలు ఎల్లపుడూ సంక్లిష్టం, నాశకరం. ఈ స్వయం రక్షక యుక్తి బంధాన్ని (Attachment) కలుగజేస్తుంది. బంధం బాధను కలుగ జేసినపుడు, అదే యుక్తి మళ్ళీ బంధ విముక్తి కావాలని కోరుతుంది. త్యాగం ద్వారా దర్పంలో, గర్వంలో ఆనందం పొందుతుంది. యుక్తి, ప్రయుక్తులను, వాటి ధోరణులను, అహంకార పోకడలను అర్థం చేసికోవడం (తెలివి) ప్రజ్ఞా పాటవానికి (Intelligence) మొదలవుతుంది. (CL I-113)

అత్యున్నతమైన తెలివే సత్యం, దేవుడు అది వర్ణించ వీలులేదు. దాన్ని పొందాలంటే మనకు మనం ప్రత్యేక నిపుణత పొందాలి. (FLF)

జాగ్రత్తగా వినండి. (ఆలోచనను ప్రతిభావంతంగా వినియోగించినప్పుడు మానసిక స్థితి చూడండి). ఇది నిజంగా చాలా తేలిక, విశ్లేషణ (ANALYSIS)

మంచిది కాదనుకొన్నాం, ఎందుకో చెప్పాం. దాని సత్యం తెలిస్తే అర్థమైనట్లే. అర్థంగాక ముందు విశ్లేషణ జీవిత నిబద్ధతలో ఒక భాగమని అంగీకరించావు. ఇప్పుడు విశ్లేషణయొక్క నిరుపయోగమని తెలిసింది. ఆ వాస్తవికత చూడగానే అది తొలగిపోయింది. విశ్లేషణను ప్రక్కకు పెట్టిన మనస్సుయొక్క స్థితి ఏమిటి? అది స్వేచ్ఛగా వుంది, అవునా? అది ఇంకా ఎక్కువ చైతన్యంగా, ఉత్సాహంగా అంచేత మరింత తెలివిగా, నిశితంగా, ఎక్కువ స్పందనతో వుంది. భయం ఎలా ప్రవేశిస్తుందో చూచారు యదార్థం తెలుసుకున్నారు, ఆనందము యొక్క పోకడలు చూచారు, మీ మనసు స్థితిని గమనించారు. అప్పుడు మీ మనస్సు స్థితిని చూడండి. అది ఇంకా సూక్ష్మంగా, స్పష్టంగా అందుచే అద్భుతమైన తెలివితో వుంటుంది, ఈ తెలివికి జ్ఞానంతో సంబంధము లేదు, అనుభవముతో పనిలేదు. స్పందించడం ఎలాగో కాలేజీకి వెళ్ళి నేర్చుకుంటే వచ్చేది కాదు. మొత్తం విశ్లేషణను సన్నిహితంగా పరిశీలిస్తే తెలివి వచ్చింది. అందులో ఏముందో చూస్తే తెలివి వచ్చింది. కాలం, ఆలోచన, ఒక విభాగం మొత్తాన్ని సరిచేస్తుందనేది మూఢాలోచన. భయం యొక్క స్వభావం అర్థం చేసుకొని వుంటే, సంతోషం ఏమిటోకూడ అర్థమవుతుంది. (BV-30)

అలవాటయిన భయం రేపు వచ్చిందనుకో, దాన్ని ఎలా ఎదుర్కోవాలో తెలుస్తుంది. వాయిదా వేయడానికి కాదు, దాన్ని కలవడమే ఆ నిముషములో దాన్ని సమాప్తి చేయడమే, ఎందుకంటే తెలివి పనిచేస్తున్నది. తెలిసిన భయాలేగాక, లోతైన దాగిన భయాలుకూడ వున్నాయి, (BV-31)

“నాకు తెలియదు” అనే స్థితే తెలివి. అది తెలిసిన క్షేత్రంలో పనిచేయడానికి సహకరించ గలదు. కావాలంటే వేరేచోట కూడ పనిచేయడానికి స్వేచ్ఛగా వుండగలదు. (A I-38)

“అవును, బుద్ధితో అంగీకరించాము. శబ్దార్థం ద్వారా ఏకీభవించాము. అందులో తర్కం, వరుసక్రమం వుందని తెలిసింది.”అని మీరంటారు. అయితే మీరది దాటి పోలేరు. ఎందుకంటే మీ మనస్సు ఆలోచన ప్రక్రియలో తగుల్కొంది. ఆలోచనంటే కొలమానం. ఆలోచన లోతుగాని, ఎత్తుగాని కొలవలేదు, దాని స్థాయిలో కొలుస్తుంది. (A I-363)

ఆలోచన సమర్థిస్తుంది. లేకపోతే విమర్శిస్తుంది. ఉద్రేకం పొందుతుంది.

అయితే బుద్ధివచ్చి చెపుతుంది. "చూసు, జాగ్రత, కంట్రోల్ చేసికో" బుద్ధిది ఎప్పుడూ పై చెయ్యే ఆలోచనే, అవునా? నాకు ఇతరునితో వున్న సంబంధములో కోపం, చిరాకు, ఉద్రేకము వస్తాయి. అపుడేం జరుగుతుంది? అది గొడవకు దారి తీస్తుంది. ఇద్దరు మనుషుల మధ్య తగాదా వస్తుంది. అపుడు నేను కంట్రోల్ చేయ డానికి ప్రయత్నిస్తా.- అది ఆలోచనే ఎందుకంటే అది ఒక పద్ధతి ఏర్పాటు చేసు కుంది. ఇది చెయ్యాలి, ఇది చెయ్యకూడదనుకొంది. అంచేత "కంట్రోలు చెయ్యాలి అంటుంది. దాన్నిబట్టి మన మేమంటామంటే "నిగ్రహం వుండాలి, లేకపోతే సం బంధము తెగిపోతుంది" అది అంతా ఆలోచనా ప్రక్రియ. లేదా, బుద్ధీకరణముకాదా? జీవితంలో బుద్ధికి అద్భుతమైన ప్రాధాన్యత వుంది. ఉద్రేకాలు తప్పా, వొప్పా లేక నిజమా, అబద్ధమా అని అనడం లేదు. కాని ఆలోచన తన కొలమానంతో తీర్పు తీరుస్తుంది, రూపొందిస్తుంది. నిగ్రహిస్తుంది, అధిగమిస్తుంది. కనుక ఆలోచన పరిశీలనకు అడ్డు వస్తుంది. (A I-364)

"నేను" అనేది అల్లరికి కారణమని మనసుకు తెలుసా? మనసు అనే కన్న తెలివి అనడం మేలు. అది హింసతోను, చిక్కులతోను వున్న మొత్తము పటాన్ని చూడగలదు. "నేను" అనేది ద్వాష్యానికి మూలకారణమని మనస్సు అంటుంది. "నేను" లేకుండా బ్రతకడము సాధ్యమా? అని ఆ గమనించిన మనస్సే అంటుంది. (AD-503)

మొత్తం పటాన్ని పరిశీలించే మనస్సు "నేను" అనేదాని కన్న వేరైం దని తెలుస్తుందా? ఈ "నేను" "అనేది కూడ గమనిస్తుంది కాని పటం నుండి తెగతెంపులు చేసికోవడానికి భయపడి ఇష్టపడదు. "నేను" (సాధారణంగా) పరిశీ లించడం వేరు. కేవలం పరిశీలించడము వేరు. "నేను" ను పరిశీలించడానికి అది భయపడుతుంది. అందుకని అది అడ్డుతగులు, అంటుంది. "నేనెలా బ్రతకాలి?నేనేం చెయ్యాలి? ఇది వదిలెయ్యాలా? అదీ పట్టుకోవాలా?" అలా, అలా అంటుంది. మనం ఏమనుకున్నామంటే "నేను" అనుదాని ప్రతిగమనం హింసాత్మకమే. కేవలం పటాన్ని పరిశీలించడం వేరుగా వుంది. ఇది స్పష్టమేనా? ఇపుడు మీరు ఏది చేస్తున్నారు? (A I-504)

వుద్దేశ్యం, మార్గం లేకుండా కేవలం చూడటంవల్ల ఒకచర్య, వుద్దే

శంతో, ప్రయత్నంతో "నేను" చూడడం వల్ల మహాశ్చర్య జరుగుతుంది. రెండవది చూస్తుంది, కాని ఏమి చేయాలన్నా భయమే. (A I-504)

నిజమైన పాఠశాల విద్యార్థుల ద్వారా ప్రపంచానికి ఆశీస్సు తేవాలి. అది ప్రపంచానికి చాలా అవసరం. వ్యక్తులకు వాంఛలు, అధికార కాంక్షలు లేనపుడు, ప్రపంచ సమస్యలు అవగాహన చేసికొన్నప్పుడు ఆ ఆశీర్వాదము లభిస్తుంది. దానికి ఎంతో తెలివి కావాలి. అంటే ఒక ప్రత్యేక విధానములో ఆలోచించని మనస్సు, స్వేచ్ఛగా వుండే మనస్సు కావాలి. అది నిజాన్ని చూడగలదు, అబద్ధాన్ని, ప్రక్కకు నెట్టివేయగలదు. (LH-177)

.... ....

సంస్కరణ వలన దుఃఖము తొలగదు. స్వభావములో మార్పురావలెను. మనిషిని సంపూర్ణముగా మార్చుట సంస్కృతి పని.

.... ....

# విశ్వాసం — భయం

## నమ్మకాలు విడదీస్తాయి

తెలియని దాన్ని గూర్చి భయం కారణంగా ఉంటుంది. నమ్మకాలు సూత్రాలు మనలో పాతుకు పోయి ఉంటాయి. భయంపైపు మనం చూడం; దానికి పెడముఖం ప్రక్క మొఖం పెట్టి, నమ్మకాల్లో శరణు పొందుతుంటాం. ఈ నమ్మకాలు హిందువులవి, బౌద్ధులవి, క్రైస్తవులవి ఎవరిపైనా సరే పరిశీలిస్తే అవి మనుష్యుల్ని విభజిస్తున్నాయని బోధపడుతుంది. ఏరకమైన సూత్రాలు, నమ్మకాల్ని బట్టి వ్రతాలు, ఒత్తిళ్ళ వరుసగా ఉంటాయి. అవి మనసును బంధిస్తాయి. మనిషి నుండి మనిషిని విడదీస్తాయి. (LH-133)

## నమ్మకం నష్టదాయకం

సత్య మేమిటని మొదలు పెడతాము. ఈ దుఃఖానికి, బాధకు, పెనుగులాటకు కారణమేమి, వాటి ప్రాముఖ్యత యేమని యోచిస్తాము. చివరికి కొన్ని నమ్మకాల్లో, వ్రతాల్లో, సిద్ధాంతాల్లో, చిక్కుకుపోతాం. నమ్మకాన్ని ప్రక్కకు నెట్టేటంత స్వావలంబనగాని, శక్తిగాని, అమాయకత గాని మనకు ఉండవు; అంచేత పరిశీలించలేం. కాబట్టి నమ్మకం జీవితాల్లో వినాశ కరమైన అంశంగా పని చేస్తున్నది. (LH-133)

## నమ్మకం అవినీతిమయం

నమ్మకం అవినీతి కరమైంది. ఎందుకంటే నమ్మకం వెనుక, ఆదర్శప్రాయమైన నీతి వెనుక "నేను" అనేది దాగి వుంటుంది. అదే ఆత్మ–అది ఎప్పుడూ ఇంకా పెద్దదిగా, ఇంకా బలమైందిగా పెరుగుతూ వుంటుంది. దేవునిలో నమ్మకమే మతమనుకుంటాం. మతపరంగ వుండడమంటే నమ్మకమే అనుకుంటాం. నమ్మకపోతే సంఘం నిన్ను నాస్తికుడని, తిట్టిపోస్తుంది. నమ్మితే ఒక సంఘం తిరస్కరిస్తుంది, నమ్మకపోతే మరో సంఘం తిరస్కరిస్తుంది. రెండూ ఒకటే. (LH-134).

## నమ్మకం స్వేచ్ఛా పరిశీలనకు ఆటంకం

అలా మతమొక నమ్మకానికి సంబంధించిందయింది. నమ్మకం మనసును పరిమితం చేస్తుంది. దాంతో మనసు ఎప్పుడూ స్వేచ్ఛగా వుండలేదు. కాని స్వేచ్ఛ ద్వారా మాత్రమే సత్యమంటే ఏమిటో, దైవమంటే ఏమిటో తెలిసికోగలవు. నమ్మకంతో మాత్రం కాదు. ఎందుచేత నంటే నీ నమ్మకం, ముందుగా దేవుడంటే ఇలా ఉండాలి, సత్యమంటే ఇలా ఉంటుంది అని రూపొందిస్తుంది-దేవుడు, ప్రేమ, మంచి తనం; దేవుడు ఇది, దేవుడు అది అని నమ్మితే, నీ నమ్మకమే దేవుడ్ని, సత్యాన్ని అవగాహన చేసి కోవడానికి అడ్డు వస్తుంది. కాని నమ్మకం ద్వారా నిన్ను నీవు మరచి పోవాలని చూస్తున్నావు. నిన్ను నీవు త్యాగం చేసికోవాలను కుంటున్నావు. మరొకరిలా కావాలను కుంటున్నావు. నీలో జరిగే నిరంతర ఘర్షణను బహిష్కరించి, పుణ్యం పొందాలను కుంటున్నావు. (LH-134)

నీ జీవితం నిరంతరం పోరాటం; అందులో దుఃఖం, బాధ, ఆపేక్ష, జారి పోయే ఆనందం, వచ్చిపోయే సుఖం ఉన్నాయి. వాటికి అవల ఏదో ఉందనీ, దాన్ని ఆలంబనం చేసికోవాలని మనసు అనుకుంటుంది, దాంతో తాదాత్మ్యం చెందాలని అనుకుంటుంది.

## దైవ విశ్వాసం కూడా మనోగతమే

దానికి దేవుడని, సత్యమని మనసు పేరు పెడుతుంది. నమ్మకం ద్వారా, నచ్చుబాటు ద్వారా, తర్కం ద్వారా అనేక రకాల శిక్షణా విధానాల ద్వారా, ఆదర్శ ప్రాయమైన నీతి ద్వారా దాంతో తాదాత్మ్యం చెందుతుంది. కాని ఆ విశాలమైనది, ఊహాగానంలో వున్నది "నేను" అనే దానిలో ఒక భాగమే. జీవితపరీక్ష నుండి తప్పించుకోవాలనే ప్రయత్నంలో మనసే దాన్ని ప్రవేశపెట్టింది. (LH-134)

## 'నమ్మకం' లేని మనసే సత్యం చూడగలదు

సత్యం అంటే ఏమిటి అని కదా అన్నిటికన్నా తెలిసికోవలసింది! కాబట్టి ఎలాంటి నమ్మకం పెట్టుకోకుండా, సత్యమంటే ఏమిటో, దేవుడంటే ఏమిటో తెలిసి కోవడానికి శక్తి, స్వావలంబనం, కృషి వుండాలి. నమ్మకం నీ మనస్సుకు స్వేచ్ఛ నివ్వదు. నమ్మకం అవినీతిని కలగచేస్తుంది, బంధిస్తుంది. చీకటి మయం చేస్తుంది.

స్వశక్తి ద్వారా, స్వావలంబన ద్వారా మాత్రమే మనస్సు స్వేచ్ఛగా వుండగలదు.
(LH-135)

## "క్షణ క్షణ గమనిక ద్వారానే సత్య సందర్శనం"

దేవుడంటే ఏమిటో, సత్యమంటే ఏమిటో ప్రత్యక్షంగా అనుభూతి పొందాలంటే ఎలాంటి నమ్మకంవల్ల, వ్రతంవల్ల, అనుసరణవల్ల, ఇతరుల నారాధించడంవల్ల, సాధ్యం కాదు. వ్యక్తిగా నీదైన నీ జీవితంలో క్షణ క్షణ గమనికలో సత్యాన్ని కనుగొనాలి. అప్పుడు స్వేచ్ఛగా ఉండవీలవుతుంది. (LH - 135)

## "భయం నుండి విముక్తి ఎలా?"

హిందువుగానో, కమ్యూనిష్టుగానో, క్రైస్తవుడుగానో ప్రత్యేక నమ్మకం, పక్షపాతం లేనప్పుడు మాత్రమే స్పష్టంగా ఆలోచించగలవు, లాభాన్నిగాని, భద్రతను గాని కోరనపుడు మాత్రమే స్పష్టంగా, సూటిగా, సరళంగా యోచించగలవు. అపుడు భయం నుండి స్వేచ్ఛ పొందుతావు. (TMC-41)

## "నమ్మకం అవగాహనకు అవకాశం ఇవ్వదు"

నమ్మకం యొక్క పని గందరగోళం పుట్టించడం, నాశనం చేయడం. మొదట క్రమశిక్షణగాను, నిర్మాణాత్మకంగాను కనపడవచ్చు, కాని దాని స్వభావములో ఘర్షణ, క్లేశం ఉన్నాయి. మతపరమైంది గాని, రాజకీయమైంది గాని ప్రతి నమ్మకం (మనిషికి మనిషికి ఉండే) సంబంధాన్ని అవగాహన చేసికోనివ్వదు. అవగాహన లేనిదే క్రియాశీలత ఉండదు. (COL I-56)

అభిప్రాయం, నమ్మకం ప్రేమకు బద్ధ వ్యతిరేకాలు. (COL II-70)

## "మనసు నుండి బయట పడితేనే అసలు సుఖం"

సిద్ధాంతంతోను, నమ్మకంతోను బద్ధుడైనవాడు సుఖవంతుడు కాదు. సుఖవంతుడు మాత్రమే నూతన సమాజాన్ని సృష్టించగలడు. ఉన్నస్థితిని అవగాహన చేసికొన గలవాడే సుఖవంతుడు. మనసు తన రూపకల్పనల నుండి స్వేచ్ఛ పొందినప్పుడే సుఖం లభిస్తుంది. (COL II-71)

## "నమ్మకం అంటే ఏమిటి?"

మీ నమ్మకాలు మీ చదువుల మీద, మీ సంస్కృతి మీద ఆధారపడి ఉన్నాయి. సామాజికంగాను, తల్లిదండ్రులను బట్టి ఉన్న గతంయొక్క ప్రతిఫలితమే నమ్మకం, మతం యొక్క, సంప్రదాయం యొక్క ప్రభావమే నమ్మకాలు! (COL III-181)

నమ్మకం అనుభవాన్ని కల్పిస్తుంది. అనుభవం నమ్మకాన్ని బలపరుస్తుంది.

మత పరమైనట్టి, మతరహితమైనట్టి నిబద్ధతనుండి పుట్టినవే సాక్షాత్కారాలు (Visions)

## "భయరహిత జీవితం"

ఒక పద్ధతిలో ఉండాలను కొన్నపుడు భయం కలుగుతుంది. నమ్మకాన్ని ప్రోదిచేసి కొనేటపుడు భయం కలుగుతుంది. భయం లేకుండ జీవించడ మంటే ఎలాంటి ప్రత్యేక పద్ధతి లేకుండ ఉండటం.

(సారాంశం : COL III-181)

## "నమ్మకం బలహీనతకు కారణం"

"నేను బలహీనంగా ఉన్నాను, నా కాళ్ళ మీద నేను నిలబడలేను, నమ్మకాల సపోర్టు కావాలి," అనే వాళ్ళు తమను తాము బలహీన పరచు కుంటారు. దాని మూలాన ఇతరులచే దోచుకోబడతారు! ఆ దోచుకునే వాళ్ళను సృష్టించేది ఆ బలహీనులే కదా ! (సారాంశం : COL III-181)

## "నమ్మకం ఉంటే శాంతి లేదు"

నమ్మకం ద్వారా మనల్ని మనం అర్థం చేసికోగలమా? మనల్ని మనం అర్థం చేసికోవడాన్ని నమ్మకమే నాశనం చేస్తుంది. శాంతి కోరే వాడు, క్రొత్త ప్రపంచాన్ని సృష్టించదలచిన వాడు ఎలాంటి నమ్మకాన్ని కలిగి ఉండ కూడదు. మనసు పైజ్ఞానం ఎంత భారంగా ఉంటే, అంతగా అవగాహన తగ్గుతుంది. (FLF)

## "నమ్మకమే అసంతృప్తి"

నమ్మకం లేకుండా ఉండి, శుభసంకల్పం, ప్రేమ, మనసులో మనకి ఔదార్యం ఉంటే యుద్ధమే ఉండదు. మనం నమ్మకాలతోను, అభిప్రాయాలతోను, సూత్రాలతోను, పోషింపబడుతున్నాం. అసంతృప్తిగా జీవితాలు గడుపుతున్నాం. అసంతృప్తి కరమైన స్థితిగతులకు దారి తీస్తున్నాం. ఈ ఘర్షణను కొనసాగిస్తూ యుద్ధాలు కొని తెస్తున్నాము. (FLF)

## "దైవ విశ్వాసం ముక్తి నివ్వదు"

అభిప్రాయాలు ఇంట్లో తయారైనవే. ఆ ఇంట్లోనే దేవుళ్ళు తయారైనారు. మనం స్వంతంగా రూపొందించుకొన్న ప్రతీకలు పట్టుకొంటే విముక్తి రాదు.

ప్రశ్న : దైవ నమ్మకం ఉత్తమ జీవితానికి బలవర్ధకమైన ప్రాతిపదిక కదా, దైవాన్ని కాదనడం దేనికి? దైవాభిప్రాయంలో నమ్మకానికి మరింత శక్తి నెందుకివ్వ కూడదు?

## "దైవ విశ్వాసం సత్యానికి అడ్డు"

మనమీ సమస్యను కాస్త విశాలంగా, తెలివిగా చూడాలి. నేను దేవుణ్ని కాదనడం లేదు. అట్లా అనడం అవివేకమే. వాస్తవం తెలియని వాడు అర్థం, పర్థం లేని మాటల్లో తగుల్కొంటాడు. నాకు తెలుసు అనేవాడికి నిజంగా ఏమీ తెలియదు. క్షణ క్షణం సత్యానుభూతి పొందే వాడికి ఆ సత్యాన్ని వ్యక్తం చేసే మార్గం లేదు. దేవునిలో నమ్మకం వుంచడం దేవుణ్ని కనుగొనడం కాదు. ఆస్తికుడు గాని, నాస్తికుడు గాని దేవుణ్ని కనుగొనలేడు. సత్యం తెలియంది. తెలియని దానిలో నమ్మకమైనా, అపనమ్మకమైనా కేవలం స్వయం ప్రతిపాదితం (Self Projection) అందుకే అది వాస్తవం కాదు. నీ నమ్మకం నాకు తెలుసు. దానికి జీవితంలో స్వల్పమైన సాధనముందని కూడ తెలుసు. అనేక మంది అనేకం నమ్ముతుంటారు. దేవుడే శరణ్య మంటారు. నీ వెందుకు నమ్ముతున్నావు? నీకు తృప్తి, ఓదార్పు, ఆశ కల్గిస్తుందని నమ్ముతావు, అది జీవితానికి ప్రాధాన్యత యిస్తుందని అంటావు.

## "దైవ విశ్వాసం మనిషిని మార్చదు"

నిజంగా నమ్మకంతో ఇతరుల్ని దోచుకుంటావు. నమ్మకంతో రక్త తర్పణం చేస్తావు. విశ్వదైవాన్ని నమ్ముతారు, ఒకరినొకరు చంపుకుంటారు. దేవున్ని నమ్మే ధనవంతుడు నిర్దాక్షిణ్యంగా దోచుకుంటాడు, ధన సంపాదన చేస్తాడు. ఒక గుడి కడతాడు. ఒక పుణ్య దాత అవుతాడు. హిరోషిమా మీద అణుబాంబు వేసినవారు, దైవం వాళ్ళతో ఉన్నాడంటారు. జర్మనీని నాశనం చేయడానికి ఇంగ్లాండు నుండి ఎగిరి పోయిన వారు, దైవం తమతో పాటు విమాన చోదకుడంటారు !

## "నమ్మకం - వాస్తవం"

నమ్మకం వేరు, వాస్తవం వేరు. మొదటిది బానిసతనానికి దారితీస్తుంది. రెండవది స్వేచ్ఛలోనే సాధ్యం. ఒక దానికొకదానికి సంబంధం లేదు. నమ్మకం ద్వారా స్వేచ్ఛ లభించదు. నమ్మకం గాడిద ముందున్న కారెట్ దుంప కాదు. నమ్మకానికి, వాస్తవానికి మధ్య గల వ్యత్యాసం మొదట నుండి తెలుసుకోవాలి.

## "భయమే నమ్మకానికి మూలం"

నమ్మకం వాస్తవానికి దారి తీయలేదు. నమ్మకం నిబద్ధత (Conditioning) యొక్క ఫలం, భయం నుండి వచ్చేది. అంతర్గతంగానో, బహిర్గతంగానో ఉండే అధికారం యొక్క ఫలం. ఆ అధికారం సౌఖ్యాన్నిస్తుంది. ఇవేవీ వాస్తవంకాదు. ఈ మొత్తానికి వేరైంది. ఇక్కడి నుండి అక్కడికి దారి లేదు. మత సైద్ధాంతి ఒక నిర్దుష్ట స్థానం నుండి మొదలు పెడతాడు. దేవుడిలో, ఒకరక్షకుడిలో, కృష్ణునిలో క్రైస్తులో నమ్మకముంచుతాడు. అక్కడ నుండి తన నిబద్ధతననుసరించి తన మస్తిష్కంలో ఉన్న తెలివిని బట్టి సిద్ధాంతాలల్లుతాడు. కమ్యూనిస్టు సిద్ధాంతి లాగ ఒక అభిప్రాయానికి, సూత్రానికి కట్టుబడతాడు. అతడల్లేదంతా స్వకపోల కల్పితం.

## 'అవివేకులే విశ్వసిస్తారు'

సాలీడు తన గూడులో తగుల్కొంటాడు. ఇదంతా అంతే. భయం నుండి, సంప్రదాయం నుంచి వచ్చిందే నమ్మకం. రెండువేల సంవత్సరాల నుండి లేక పదివేల సంవత్సరాలనుండి ఆచారాలతో, సిద్ధాంతాలతో, నమ్మకాలతో చేసిన ప్రచారమే మత విషయకమైన శబ్దనిర్మాణం, అది ఒక పదజాలం. అంచేత శబ్దానికి

చాలా ప్రాముఖ్యత వచ్చింది. ఆ శబ్దము యొక్క పునశ్చరణ ఇంద్రజాలం సృష్టిస్తుంది. వివేకం లేని వాళ్ళెప్పుడూ విశ్వసిస్తారు, అంగీకరిస్తారు, లోబడతారు; అది మంచిదైనా, చెడ్డదైనా, నష్టదాయకమైనా, లాభదాయకమైనా సరే. నమ్మే మనస్సు ప్రశ్నించ లేదు, పరిశీలించ లేదు, అంచేత అది తన సూత్ర-సిద్ధాంత పరిధిలోనే వుంటుంది. అది గానుక్కు కట్టిన ఎద్దులాంటిది. గానుగ చుట్టూ మాత్రమే తిరగ్గలదు.
(TOR-164)

## "మనసు-ఘర్షణ"

విచారణ చేయగల పరికరము ఒక్క మనస్సే, స్పష్టంగా సూటిగా నిర్ణయాల పక్షపాతము లేకుండా, సూత్రాలు, నమ్మకాలు లేకుండా వుండే మనస్సే. అది ఘర్షణ లేకుండ వుండడం ఎంత కష్టమో గ్రహించాలి. ఘర్షణను అర్థము చేసికోడం వల్ల అసె ఘర్షణ నుండి విముక్తి చెందుతుంది. (BV-49)

## "నమ్మకాలు—అనుభూతులు"

అన్ని అనుభవాలు, సాక్ష్యాలు నిబద్ధత ఫలితాలే. దేవుణ్ణి నమ్మితే సహజంగా దానికి తగ్గ అనుభూతులు వస్తాయి. అయితే ఆ నమ్మకము భయం మీద, ఘర్షణమీద, వేదన మీద ఆధారపడ్డది. కనుక అద్భుతమైన దైవానుభూతి కూడ నీ సొంత ప్రాతిపదికయే, అనాటి సోమపానం యొక్క రహస్యం తెలిసిపోయింది. అప్పటి నుండి ఇతర దేశాల్లోవలె ఇండియాలో కూడా నిద్ర మాత్రలు, మత్తు మందులు. యల్.యస్.డి.లు మరిజూనాలు, వాటి పరస్పర కాల్పనికాలు, పొగ త్రాగుడు అన్నీ వచ్చాయి. ఉపవాసము వుంది, ఉపవాసం చేసినప్పుడు కొన్ని రసాయనిక మార్పులు వస్తాయి. ఆ మార్పు ఒక విధమైన స్పష్టతనిస్తుంది. దానిలో ఆహ్లాదముంటుంది. (BV-95)

## 'దేవుణ్నెందుకు నమ్ముతాం'

భయమున్నప్పుడే నమ్మకం పుట్టేది. దేవుణ్ణెందుకు నమ్ముతాడు? తనలో తను పూర్తిగా అనిశ్చితంగ వుండబట్టే కదా! జీవితంలో విషయాలు, వస్తువులు పరిణామం చెందుతున్నాయి, అనిశ్చితం వుంది. భద్రత లేకుండ వుంది, సౌఖ్యం లేదు మితిమీరిన దుఃఖం వుంది. ఇవన్నీ కనబడుతున్నాయి. అంచేత ఆలోచన

ఒక శాశ్వతం అనబడే వస్తువును ఆరోపింపు కుంది దానికి దేవుడని పేరుపెట్టింది. దాంట్లో మానవ మేధస్సు సౌఖ్యాన్ని పొందుతుంది. అయితే అది సత్యం కాదు. (BV-165)

## భయం

నెరవేర్చడమూ (FULFILMENT), మరణానికి భయపడడమూ రెండూ ఒక ప్రక్రియ. అవి చెరిమొక ప్రక్క చేరి "ఆత్మ"ను ("నేను" అనే దాని) బలపరుస్తాయి. నెరవేర్చడ మంటే విషయాలతోను, సంపదతోను అభిప్రాయాల తోను, దేనితోను తాదాత్మ్యం చెందడం. విషయాలు, సంపద కొంత చిక్కుతో కూడినాయి. కాని అభిప్రాయాలు కాస్త ఎక్కువ రక్షణ, భద్రత నిస్తాయి. పదజాలమూ అభిప్రాయాలూ, జ్ఞాపకాలూ, ప్రాముఖ్యమై పోతాయి. అవి స్పందన నిస్తాయి కనుక నెరవేర్చడమనేది లేక నిండు తన మనేది మాటవరకే. (COL 1-81)

## భయం సంచయానికి కారణం

ముఖస్తుతి, అవమానం, గాయం, ఆత్మీయతలను ఎందుకు నిల్వ చేసుకొంటున్నాము? వాటి అనుభవాలు ప్రోది, స్పందనాలు లేకపోతే మనం లేము. పేరు, బంధం, నమ్మకం లేకపోతే మనమేమీ కాదు. మన మేమీ కాదే, అనే భయమే అదీ ఇదీ కూడబెట్టడానికి ఒత్తిడి చేస్తుంది. తెలిసీ తెలియక వుండే ఈ భయమే మనమెంత కూడబెట్టుకునే కార్యక్రమంలో వున్నా, మన వినాశనానికి, చితికి పోవటానికి దారితీస్తుంది. ఈ భయం యొక్క వాస్తవం తెలిస్తే ఆ సత్యమే మనకు విముక్తి నిస్తుంది. అంతేగాని దాని నుండి విముక్తి పొందాలనే ఉద్దేశపూర్వక నిర్ణయం విముక్తి నివ్వదు. (COL I-92)

## "మనసు నిశ్చలంగా వుంటే 'భయం' లేదు"

నిజంగా నీవేమీ కాదనే అనుభవ పూర్వక సత్యం కనుగొన్నపుడు భయమనేది తొలగి పోతుంది. ఆ భయమైనా ఎపుడుంటుందంటే ఆలోచనా పరుని కన్నా

ఆలోచనలు పేరన్నపుడు, ఆ భావంతో సంబంధాలు పెరుగుతూ వున్నాయి. వీటి వాస్తవం తెలియగానే ఆ భయం తొలగిపోతుంది. అపుడు మాత్రమే మనసు నిశ్చలంగా, ప్రశాంతంగా వుంటుంది. సత్యం వ్యక్తమవుతుంది. (COL I-912)

## "భయం లేకుండా జీవించటం ఎలా?"

ఒక పద్ధతితో వుండాలనే కోర్కె వున్నపుడు భయం ప్రవేశిస్తుంది. కూడ కట్టుకునే ప్రక్రియలోనే భయం వుంటుంది. నమ్మకమే కూడ కట్టుకునే పద్ధతి. భయం లేకుండా బతకడమంటే, ఒక ప్రత్యేక పద్ధతంటూ లేకుండా బ్రతకడం. (FLF)

## "నా భయం"

నా భయం చావుని గూర్చి కాదు. నాకు సంబంధించిన వస్తు సంచయంతో కూడిన సహవాసం తొలగి పోతుందని మాత్రమే. (FLF)

## భయం పరిపూరణం

ఖాళీ అవుతున్నందుకు భయం. ఒంటరితనానికి భయం. అన్ని బాధలు ఎదురౌతున్నందుకు భయం- అందుకే దేనితోనో ఒక దాంతో నిండి పోవాలను కోవడం. ఈ నిండి పోవడం పెద్ద తరహా మత ప్రవక్త నుండి చిన్న తరహా సిపాయి వరకు మారుతూ వుంటుంది. మనసు దేంతోనో పూడిపోయి వుండాలి, లేకపోతే భయంకరమైనట్టి, తాను ఇముడ్చుకోలేని విషయాన్ని మనసు కనిపెట్టవచ్చు. (BV-158)

"ఆలోచనే భయాన్ని పెంచుతుంది"

భయమంటే ఏమిటి? నేను గతంలో చేసిందానితో సంబంధం లేదా! లేక భవిష్యత్తులో నేను ఊహించేది కాదా! గత సంఘటన, లేక భవిష్యత్ సంఘటన గురించి కదా! గత అస్వస్థత బాధ, భవిష్యత్తులో పునరుక్తం అవుతుందని భయం, ఆలోచనయే భయాన్ని సృష్టిస్తుంది. ఆలోచన ఆనందాన్ని పోషిస్తున్నట్లు భయాన్ని పెంచుతుంది. అయితే ఆలోచన అంతం అవుతుందా? (BV-159)

"భయానికి ఆశ్రయం ?"

మనల్ని మనం చూసుకోవడానికి ఎక్కువ మందిమి భయపడతాం. లేదా? అసంతృప్తికరమైన విషయాలు మనం కనిపెడతాం. అందుకే మన వైపునకు మనం చూడం. ఉన్న పరిస్థితి యెడల అజ్ఞానాత్మకంగా ఉండాలను కుంటాం. ఉన్న పరిస్థితి యెడల అజ్ఞానంగా వుండడమే భయం. నిరంతరం భయంతో జీవితం గడుపుతున్నాం. (COL II-62)

"భయం నుండి పారిపోవద్దు"

భయమంటే అర్థం చేసికోకుండ దానినుండి పారిపోతాం. ఆ పారిపోవడమే భయం. తెలిసిందాని వైపుకు పరిగెత్తుతాం. తెలిసింది నమ్మకాలు, వ్రతాలు, దేశ భక్తి, మతప్రబోధకుల సూత్రాలు, మతగురువుల హోమాలు వగైరా. ఇవే మనిషికి, మనిషికి మధ్య ఘర్షణ తెస్తున్నాయి. అందుకే సమస్య. తర తరానికి వ్యాపిస్తుంది. దాని మూలానికి వెళ్ళితే గాని సమస్య తీరదు. కనుక అది చెయ్యండి. ఇది చెయ్యండి అనే విధేయాత్మక ప్రబోధం-మత గురువులు, చెప్పేది భయాన్ని కొన సాగిస్తుంది. కనుక విధేయాత్మక, ధనాత్మక ప్రబోధం వినాశకరమైంది. (COL II-187)

"భయం-ఐశ్వర్యం"

లోలోపల భీతి చెందుతావు. ఒంటరిగా ఉండటానికి భయపడతాం. పైకి

సంపదలున్నా, లోపల దారిద్ర్యం ఉంది. అందుకే బలపడటానికి గాను మనుషులకు, హోదాకు, సంపదకు అంటి పెట్టుకుంటాం. (LH-31)

### "దేన్నిగూర్చి భయం"

తెలిసిందాన్ని గూర్చా, తెలియందాన్ని గూర్చా భయం? తెలియందాన్ని గూర్చి భయమెలా వుంటుంది? (TAI-204)

### "భయాలు-ఘర్షణ"

పైపై భయాలు తెలిసికొని తొలగించవచ్చు, లోలోతుల భయాలు కనుగొన లేకుండ ఉన్నారు, ఎందుకంటే వాటిని పైకి రానీయం. ఒక్కోసారి పైకి వస్తే కప్పి వేయడానికో, తప్పించుకోడానికో తొందరపడతాం. కలల ద్వారా, ఇతరత్రా లోలోతు భయాలు బయటపడతాయి. అవి మరింత నాశనాన్ని, ఘర్షణను కలిగిస్తాయి. (ESL)

### "నిర్భయత ఎలా ఏర్పడుతుంది"

గురువు, కుటుంబం, సంఘం, సంబంధించిన అధికారం, వీటి నుండి విముక్తి చెందితే నిర్భయం ఏర్పడుతుంది. వ్యక్తి పువ్వులా వికసిస్తాడు. ప్రేమతో, మంచితో వికసిస్తాడు. విద్యార్థికావిధంగా సాయపడితే, ఉపాధ్యాయుడు కూడ "నేను" "నాది" నుండి బయటపడతాడు. ప్రేమగా, మంచిగా వికసిస్తాడు. పరస్పర విద్య క్రొత్త సంబంధాన్ని కలుగ జేస్తుంది. (ESL)

.... ....

స్వచ్ఛందము సహజమునైన గమనిక సుఖము నిచ్చును. గమనించుటకు పూర్వానుభూతి. అంగీకారము నిరాకరణము పనికిరావు.

.... ....

ప్రతిముద్ర మనసుపై పడనీయకుము. నీవు పిల్లవలె అవసరములేని దానిని మనసు నుండి తొలగిపోనిమ్ము.

.... ....

నిత్యవ్యవహార విషయములు, విజ్ఞానశాస్త్ర విషయములు తప్ప మానసికానుభూతులు మరచిపోదగినవి.

.... ....

సంప్రదాయ బద్ధునికి మర్యాద లభించవచ్చును. కానీ అవగాహన యేర్పడదు. అలాంటివానికి ప్రేమించుట తెలియదు.

.... ....

# ఏకాంతం - ప్రేమ

## ఒంటరితనం

మనిషి ఒంటరి తనాన్ని సహించలేడు, భరించలేడు, ఏ ఒక్కరూ ఒంటరిగా లేరు. ఎందుకంటే సంబంధంలోనే, సంబంధంతోనే మనిషి వున్నాడు. మనుషులతో, జంతుజాలంతో, వస్తువులతో, ప్రకృతితో, భావాలతో సంబంధం పెట్టుకుని ఉన్నాడు. భౌతిక సంబంధాలు లేకుండ జీవించలేడు, అయినా ఇన్ని సంబంధాలు ఉన్నా అనేక మంది ఒంటరితనంతో బాధపడుతుంటారు. ఎందువల్ల? సంబంధాలలో లోపమైనా వుండాలి, అవగాహనలో దోషమైనా వుండాలి. మానసిక తృప్తిలో లోటు అయినా ఉండాలి.

## ఏకాకి

స్పష్టత కోసం ఒంటరితనాన్ని, ఏకాకి తనం అందాం. ఒంటరి పది మందిలో ఉన్నా ఏకాకిగానే బాధపడుతుంటాడు. వెలితి అనుభవిస్తుంటాడు. ఏదో రూపంలో భయం ఉండడంవల్ల కూడ ఏకాకి అవుతాడు. ప్రత్యేకతలు సృష్టించుకోవడంవల్ల, భౌతిక అవసరాలు మించి మానసిక అవసరాలు అనవసరంగా తెచ్చిపెట్టుకోవడంవల్ల కూడ వేర్పాటు తనం రావచ్చు.

## ఒంటరి తనానికి కారణం

ఆలోచనవల్ల, విభజనాత్మక దృష్టివల్ల ఒంటరితనం ఏర్పడుతుంది. ఏకాకి ఘర్షణకు లోనవుతాడు, అశాంతి పాలవుతాడు. ప్రసన్నంగా నిద్రపోలేడు. ఏకాకి తనం నుండి తప్పించుకోటానికి మార్గాలు వెదుకుతాడు. యుక్తితో, పద్ధతులతో ఒంటరితనాన్ని వాయిదా వేస్తాడే కాని, అది పూర్తిగా తొలగిపోదు.

## ఏకాంత స్థితి

ఒంటరితనం యొక్క నిజ స్వరూపాన్ని, మూలాన్ని, నిర్మాణాన్ని పరిశీలన యను ఖడ్గముతో ఛేదిస్తే మరోస్థితి ఏర్పడవచ్చు. సరియైన అవగాహనవల్ల భ్రమలు తొలుగుతాయి. అప్పుడుండే స్థితి ఏకాంతం కావచ్చు. ఏకాంతాన్ని (ALONE-NESS) అనీ, ఏకాకితనాన్ని (LONLINFSS) అనీ అనవచ్చు. ఏకాంతం ఏకాకితనానికి వేరైంది. ఒంటరిగావున్నా, పదిమంది మధ్యలో వున్నా, ఏకాంతుడు నిండుకుండలా నిశ్చలంగా ఉంటాడు. అసంతృప్తి అతని పైపు తొంగిచూడదు. బేలతనం ఉండదు. పాక్షికంగా వుండడు. ప్రసన్నంగా ఉంటాడు. అతనికి అంతా ఒక్కటే. అందరూ సమానులే. అతని అంతరంగమంతా ఒక్కటే. ఏకంగా, నిరామయంగా ఉంటుంది. అలాంటి హృదయంలో క్రొత్తదనం ఉంటుంది. నవ చైతన్యం వెలుగుతుంది. ప్రేమ పుట్టుకొస్తుంది.

## ప్రేమ

ప్రేమ శబ్దం చిత్రమైంది, విచిత్ర పైఖరులు కల్గిస్తుంది. అనేక అర్థాలు ఆపాదించుకొన్నది. అది పదార్థం కాదు, లక్షణం కాదు, గుణం కాదు, ఒక విశేష భావన. భావన అంటే సరిపోదు. క్రియాశీలకమైంది. సృజనాత్మకమైంది. ఒక శక్తిని ఆవిర్భవింప జేస్తుంది.

ప్రేమను వర్ణించడం కష్టం. వివరణ ప్రేమకాదు. మాటలతో నిరూపించడంలో వాస్తవికత లోపిస్తుంది. అయినా అవగాహన నిమిత్తం కొంత చర్చించక తప్పదు.

## ఆకర్షణ ప్రేమ కాదు

ప్రేయసికి, ప్రియుడికి మధ్య ఒక విధమైన ఆకర్షణ ఉంటుంది. ఆకర్షణవల్ల కల్గేది ప్రేమకాదు. లభాలాన్ని, ఆలంబనాన్ని కోరేది ప్రేమ ఎలా అవుతుంది?

## లైంగిక మోహం ప్రేమ కాదు

భార్యాభర్తలు మధ్య ఒక లైంగిక సంబంధం ఉంది. కేవలం సంబంధం ప్రేమకాదు. ఎందువల్లనంటే ఆ సంబంధంలో బంధం, భద్రతాపేక్ష, ఇచ్చుపుచ్చు కోవడాలు ఉంటాయి.

## కామం ప్రేమ కాదు

లైంగికానందం నిమిత్తం స్త్రీ పురుషులు చేరువౌతారు. సెక్స్‌ను ఆ విధంగా విడగొట్టి చూస్తే అది ప్రేమ కాదని తెలుస్తుంది. ఎందుకంటే అందులో భయం ఇమిడి ఉంటుంది. కనుక అది అంతటితో ఆగి పోతుంది.

## అధికారం ప్రేమ కాదు

తల్లికి బిడ్డలపై ఉండేది, గురువుకు శిష్యునిపై వుండేది, నాయకునికి అను చరులపై ఉండేది, మంత్రికి ప్రజలపై ఉండేది ప్రేమా?

కావచ్చు, కాక పోవచ్చు, ఎంచేతనంటే వారి మధ్య గల సంబంధం అభ్దిమీద, ఆశమీద, ఆకాంక్షమీద ఆధారపడిందా లేదా అనేదానిని బట్టి ఉంటుంది.

అందుకే ఆలోచనతో కూడింది ప్రేమ కాదు. పాక్షికమైంది ప్రేమ కాదు. కుల, మత శాఖా విభాగ ప్రత్యేకతలు ప్రేమ కాదు. ఎందుకంటే అవి. విభజ నాత్మకాలు.

## దైవభక్తి ప్రేమ కాదు

దేవుని యెడ చూపే భక్తి ప్రేమా? కాదు; ఎందుకంటే అది విశ్వాసంపై ఆధారపడింది, కాని వాస్తవంపై కాదు.

అయితే ప్రేమంటే ఏమిటి? ప్రేమ కానిదాన్ని చెప్పగలం గాని, అయిన దాన్ని చెప్పడం కష్టంగా వుంది. జాలి, దానం ప్రేమకాదు, ద్వేషం లేనిది ప్రేమ, సమ భావన ప్రేమ, అనురాగం ప్రేమ, ప్రజ్ఞ ప్రేమ, కరుణ ప్రేమ, దురుసైన ప్రశ్నకు

మృదుపైన సమాధానం ప్రేమ. ఇంకా ప్రేమంటే కృష్ణజీ ఏంచెప్తాడో చూద్దాం!
జె. శ్రీ.

# ప్రేమ

## ప్రేమ ఒక జ్వాల

ప్రేమ వింతైన వస్తువు; ఆలోచనతో అల్లి పేసినంతవరకు, అది ప్రేమ కాదు. నీవు ప్రేమించిన వానిని తలంచినపుడు, ఆ మనిషి నీకు ఆహ్లాదసాధన మౌతాడు. ఆహ్లాదం ప్రేమ కాదు. అసలు ఆలోచనా ప్రక్రియే ప్రేమను నెట్టి వేస్తుంది. పొగలేని జ్వాలే ప్రేమ. ఆ పొగే ఆలోచన; ఈర్ష్య, వైరం, వాడు కోవడం - అవన్నీ మనసుకు సంబంధించినవి. హృదయమంతా మనసుకు సంబంధించిన వాటితో నిండిపోతే అక్కడ ఉండేది ద్వేషం. ఎందుకంటే మనసులో వుండేది ద్వేషం, ద్వేషానికి, వ్యతిరేకతకు, విరోధానికి, ఘర్షణకు మనసు స్థానం.
(COL II-11)

ఆసక్తి అనే దాన్ని ప్రేమించడమంటే దాన్ని అర్థం చేసికోవడం. ముఖాముఖి అవగాహన (Commintion) లేకుంటేనో, అభిప్రాయాలుంటేనో, నిర్ణయాలుంటేనో ప్రేమించలేవు; ఆసక్తికి వ్యతిరేకంగా ప్రతిజ్ఞ తీసుకొంటే దాన్ని ఎలా ప్రేమించగలవు? ప్రతిజ్ఞ అంటే ఒక విధమైన వ్యతిరేకత, దేన్ని వ్యతిరేకిస్తామో చివరికి అదే జయిస్తుంది. (COL II-56)

## ప్రేమ

ప్రేమ వింతైన వస్తువు. మనం తేలిగ్గా దాని వెచ్చని మంటను పోగొట్టు కుంటాం. మంట పోతుంది, పొగ మిగులుతుంది. మన హృదయాలు, మనసులు

పొగతో నిండి పోయాయి. కన్నీళ్ళతో, దేశంలో రోజులు గడుపుతున్నాం. పాట మరచి పోయాం, మాటలకు అర్థం పోయింది. పరిమళం పోయింది. చేతులు వట్టిపై పోయాయి. పొగ లేకుండ మంటను స్పష్టంగా చేసకోవడం మనకు తెలియదు. పొగ ఎప్పుడూ మంటను అణచి వేస్తుంది.

ప్రేమ మనసుకు సంబంధించింది కాదు. ఆలోచన అనే గూడులో లేదు. దాన్ని వెతకలేం, అభ్యసించలేము, పోషించలేము, మనసు మౌనంగా హృదయం ఖాళీగా ఉన్నపుడు ప్రేమ వుంటుంది. (CL II-38)

## ప్రేమ మాటలకు అందదు

ప్రేమకు పేరు లేదు. అందుకే హింసాత్మకం కాదు. సంతోషం దౌర్జన్యంతో కూడింది. ఎందుకంటే అందులో కోరిక, సంకల్పం రెండూ చలనాత్మక అంశాలు. మంచి మాటలతో ప్రేమను పుట్టించలేము. మొత్తం ఆలోచన ప్రక్రియను కాదనడమే ప్రేమ. కాదనడంలో ఉన్న సౌందర్యమే ప్రేమ. ఇది లేకుండ సత్యానందం లేదు. (TOR-146)

## ప్రేమ ఎలాంటిది ?

ప్రేమ తయారయ్యే స్థితి కాదు. నేను అలా అవుతాను అనేది చెల్లదు. ఏదో కాబోవడం అనేది దానికది వేరై పోవడమే. అందుచేత ముఖాముఖి అవగాహన వుండదు. ప్రేమ సున్నితమైంది. బహిరంగమైంది. చింతించేదికాదు, తెలియనిది. (CLI-183)

## ప్రేమ ఇచ్చి పుచ్చుకునే సరుకు కాదు

నీవు నన్ను ప్రేమిస్తున్నావు కనుక నేను కూడ నిన్ను ప్రేమిస్తున్నాను; అది వ్యాపారం. అది మార్కెట్‌లో కొనేది. అది ప్రేమ కాదు. ప్రేమించడం అంటే ప్రతిఫలం కోరడం కాదు. ఏదో ఇస్తున్నాననీ భావన కూడ వుండరాదు. అలాంటి

ప్రేమే స్వేచ్ఛ నెరుగ గలదు: కాని నీవు దానికి తగినట్లు విద్య గడించ లేదు. నీవు లెక్కల్లో, రసాయన శాస్త్ర్యంలో, భూగోళ శాస్త్రంలో, చరిత్రలో, విద్యా శిక్షణ పొందావు. అంతటితో ఆగి పోయేవు. ఎందుకంటే నీ తల్లి దండ్రులకు కావలసింది ఒక మంచి ఉద్యోగం రావటం, జీవితం విజయవంతం కావడం. తల్లి దండ్రులు పిల్లలను ప్రేమ లేని పోటికి చదువు కై పంపుతారు. అందుకే మన సమాజం క్రమంగా క్షీణించి పోతున్నది. నిరంతర క్లేశంలో వుంది. రాజకీయ వేత్తలు, న్యాయాధిపతులు, దేశ భక్తులనబడేవాళ్ళు శాంతిని గూర్చి మాట్లాడినా, అందులో అర్థం ఉండదు. (TME-125)

## ప్రేమ లేకపోతే శవప్రాయుడవే

ప్రేమించ బడాలని పట్టుపట్టినంత కాలం నీలో ప్రేమ వుండదు. ప్రేమ భావన కలగక పోతే నీవు అసహ్యంగా, క్రౌర్యంగా వుంటావు. అలాంటప్పుడు ఎందుకు ప్రేమించ బడాలి? ప్రేమ లేకపోతే శవప్రాయుడవే. చచ్చిన వస్తువు ప్రేమను కోరడం ఇంకా చచ్చినట్లే కాగలదు. కాగా నీ హృదయం ప్రేమతో నిండి వుంటే, ప్రేమించ బడాలని కోరవు. నీ ఖాళీ బొచ్చెను నింపమని దాన్ని ఎవరి ముందూ పెట్టవు. ఖాళీగా వున్నవాడే నింపబడాలని కోరేది. శూన్య హృదయం ఎన్నటికి పూరింపబడదు. గులుపుల పెంటబడడం, వేరే వందలాది విషయాల ద్వారా ప్రేమను కోరడం జరగదు. (TMC-200)

జీవితంలో అందము, అర్థము ఉన్నాయి: ఎప్పుడంటే నీ హృదయం మనసుకు సంబంధించిన విషయాల నుండి పరిశుద్ధం చేయబడినపుడు. (TMC-203)

## ప్రేమ రాహిత్యమే కురూపత

స్పష్టమైన చర్మం ఉండవచ్చు, చక్కని ముఖం ఉండవచ్చు. ప్రీతి కరమైన చీర కట్టవచ్చు. లేక గొప్ప వ్యాయామ కారుడవు కావచ్చు. కాని నీ హృదయంలో ప్రేమ లేకపోతే నీవు అసహ్యమైన మానవమాత్రుడవు. కొలతకు మించి నంత అసహ్యంగా ఉంటావు. ప్రేమించినపుడు, ముఖం సుందరంగా ఉన్నా, సామాన్యంగా

ఉన్నా ముఖంలో కళ వెలుగుతుంది. జీవితంలో ప్రేమ గొప్ప వస్తువు, దాన్నిగూర్చి మాట్లాడడం, భావించడం, పోషించడం, నిలవ చేయడం, చాల ముఖ్యం. లేకపోతే అది చిందరవందరై పోతుంది. ఎందుకంటే ఈ ప్రపంచం చాల క్రూరమైంది. యౌవనంలో ప్రేమగా ఉండవు. ప్రజలను, జంతువులను, పువ్వులను ప్రేమతో చూడకపోతే, పెద్దవాడవై నపుడు నీ జీవితం శూన్యంగా ఉంటుంది. చాల ఒంటరివై పోతావు. భయంతో కూడిన చీకటి నీడలు ఎప్పుడూ వెంటాడుతాయి. కాని నీ హృదయంలో ఈ అసాధారమైనది, ప్రేమ అనబడేది ఉంటే, లోతుగా భావిస్తే, దాని ఆనందం, దాని తన్మయత వలన నీకు ఈ ప్రపంచం మారిపోయినట్లు కనుగొంటావు. (TMC-169)

## క్రమశిక్షణ ప్రేమ

ప్రేమించగలిగినపుడు క్రమ శిక్షణతో పనిలేదు, ప్రేమ క్రియాత్మకమైన అవగాహన ఇస్తుంది. కనుక నిరోధం లేదు: ఘర్షణ లేదు. ప్రత్యేకించి యౌవనంలో ఉన్నపుడు పూర్తి భద్రతతో, పూర్తిగా విశ్రాంతి ఉంటే సమగ్రంగా ప్రేమించడం సాధ్యం.... (TMC-102)

## ప్రేమ - విశృంఖలత

ప్రేమించేవాడు ఇష్టంవచ్చినట్లు చేయడు. ప్రేమ మాత్రమే సరియైన క్రియకు దారి తీస్తుంటి. ప్రేమించడమే ఈ ప్రపంచంలో క్రమతను తెస్తుంది. ప్రేమను, దాని పని దాన్ని చెయ్యనివ్వండి. (TMC-103)

## ప్రేమ - ఆలోచన

ప్రేమ ఆలాంటిది కాదు, దారికి అడ్డంగా ఉన్న కొయ్యదుంగ లాంటిది. అది నశించిపోతూ, కొత్తతనాన్ని సంతరించుకొంటుంది. అందులో ఆలోచన కోరే శాశ్వతత్వం లేదు. ఆలోచన అర్థంచేసికోలేని చలనమది. ఆలోచన ఆ చలనాన్ని స్పృశించలేదు, భావించలేదు. ఆలోచనా భావన, ప్రేమ భావన-రెండూ వేర్వైనవి.

మొదటిది బంధానికి, రెండోది మంచిగా పుష్పించడానికి దారి తీస్తాయి. ఈ పుష్పించడం ఒక సామాజిక సంస్కృతి, మత క్షేత్రాలకు సంబంధించింది కాదు. కాని బంధం సమాజాలకు, మత నమ్మకాలకు, పరమందు విశ్వాసానికి చెందింది.

(TOR-146)

## చింతన ప్రేమ కాదు

ప్రేమంటే ఆలోచనా ? ప్రేమించిన వాన్ని గూర్చి మనం ఆలోచించవచ్చు: అతడు లేనపుడు, అతన్ని గూర్చి చింతిస్తాం. అతని ప్రతిమో, ఫొటోనో ఉన్నపుడు అతన్ని గూర్చి ఆలోచిస్తాం. దూరం కావడమో, వేరు కావడమో ఆలోచనకు ఆస్కారం.

(CL I1-107)

## సుఖం - ప్రేమ కాదు

ప్రేమకు నీతి శాస్త్రంలేదు. ప్రేమంటే సంస్కరణ కాలేదు. ప్రేమ ఉల్లాసమైతే, బాధకూడ తప్పదు. ప్రేమ ఆలోచన కాదు. ఆలోచన ఉల్లాసం ఇచ్చేది. లైంగిక సంతోషాన్ని, సాధించేమన్న సంతోషాన్ని ఇచ్చేది ఆలోచన, ఆలోచన బలపడి చలన ఉల్లాసాన్ని ఇంకా కొనసాగిస్తుంది ఆలోచన చలన ఉల్లాసాన్ని గూర్చి చింతిస్తూ, తరువాతి చలనోల్లాసానికి బలాన్నిస్తుంది. ఈ ఉల్లాసం గట్టిగా ఇంకా గట్టిగా కావాలని కోరడమే సెక్స్ (లైంగికేచ్ఛ). అపును కదా! దాంతో పాటు ఎంత ఆప్యాయత, మృదుత్వం, జాగ్రత్త, తోడు ఇక దానికి సంబంధించినవన్నీ ఉంటాయి. వాటి ద్వారా బాధ, భయం అనే దారం ఉంటుంది. తన చర్య ద్వారా ఆలోచన ఈ దారం తెగకుండ చేస్తుంది.

నీవు ఉల్లాసపడే ఈ సంతోషం వయసు ద్వారా, ప్రమాదం ద్వారా, కాలం ద్వారా అంత మయ్యే సరికి చిక్కుల్లోపడి పోతావు. అపుడు దుఃఖమే నీడ.

కాని ప్రేమ ఉల్లాసం కాదు. అది కోర్కె ఫలం కాదు. అందుకే మానవుడు వేరే కొలతలో ప్రవేశించాలి. అందులో మన సమస్యలు, చిక్కులు అన్నీ తీరతాయి. అది లేకుంటా ఏంచేసినా దుఃఖం, గందరగోళం తప్పవు.

(TR-62)

## సంభోగం ప్రేమకాదు

ప్రేమంటే ఏమిటి? ఆనందమా? -మళ్ళీమళ్ళీ జరిపే లైంగిక క్రియలో ఉండే ఆనందమా? సామాన్యంగా దాన్నే గదా ప్రేమ అంటున్నాము. పొరుగువాని మీద ప్రేమ, భార్య మీద ప్రేమ, గొప్ప ఆనందాన్ని, సౌఖ్యాన్ని, స్వామ్యాన్ని ఇస్తాయి కదా! అవి కోర్కెమీదే ఆధారపడ్డాయి. అదేనా ప్రేమ? ఒకరిపై స్వామ్యంతో కూడిన బంధ మేర్పడితే, అది ఈర్ష్యను, భయాన్ని, వైర్యాన్ని కలిగిస్తాయి. ఇవి అందరికీ తెలిసిన వాస్తవాలు, అసాధారణమైనవి కావు. సైద్ధాంతిక మైనవి కావు. కేవలం వాస్తవాలు: అది "ఉన్న స్థితి". కనుక ప్రేమంటే బంధమైనా? బంధానికి ప్రాతిపదిక ఏమిటి? మనిషి దేంతోనైనా ఎందుకు బంధం పెట్టుకుంటాడు? ఆస్తి, అభిప్రాయం, సిద్ధాంతం, వ్యక్తి, చిహ్నం, దేవుడనే భావన-ఎందుకు వీటితో బంధితుడౌతాడు? బంధం యొక్క ప్రాధాన్యత పూర్తిగా అర్థం చేసికోపోతే సత్యాన్ని, ప్రేమను ఎప్పటికీ కనుగొన లేడు. ఒంటరినై పోయాననే భయంవల్ల కాదా బంధం? దూరమై పోయాననే భయంవల్ల శూన్యంగా ఉన్నానన్న భయంవల్ల కాదా? తనలో చాలినంత లేదనే భావన వల్ల కాదా?

భద్రత ఉంటుందని దేంతోనో బంధం పెట్టుకుంటారు. నిజంగా వాటిలో భద్రత ఉందా? ఏదైనా పొందినాక, పోతుందనే భయం ఏర్పడుతుంది. ధాంతో ఈర్ష్య, ద్వేషం, విషాదాలు మొదలగునవి అనుసరిస్తాయి. (TWL-151)

## రాగ ద్వేషాలు ప్రేమకాదు

బాధ ఉన్న చోట ప్రేమించలేవు. అదే సత్యం, అది చట్టం. నీవు ఎవరినైనా ప్రేమిస్తే, నీ కిష్టం లేని పని వాళ్ళు చేస్తే నీవు బాధపడతావు నీవు ప్రేమించడం లేదని తెలుస్తుంది. దీని సత్యం చూడండి. నీ భార్య నిన్ను కాదని, ఎవరితోనో వెళ్తే నీవు ఎలా బాధపడతావు, బాధపడతాం, కోప్పడతాం. ఈర్ష్య, అసూయ, ద్వేషం కలుగుతాయి. అయినా, "నేను నా భార్యను ప్రేమిస్తాను" అంటావు. అలాంటి ప్రేమ ప్రేమ కాదు. కనుక బాధ పడకుండా, అనంత ప్రేమ వికాసం పొందడం సాధ్యమా?

## బాధలో ప్రేమ లేదు

నన్ను నేను వ్యక్తం చేసికోవడమే బాధ. బాధలో స్వయం సానుభూతి, ఒంటరితనం, తప్పించుకొనే ప్రయత్నం, పెళ్ళి పోయిన వాళ్ళతో ఉండాలనే యత్నం, అన్నీ చేరి ఉంటాయి. బాధే నేను, అదే ప్రతిబింబం, జ్ఞానం, గత స్మరణ. కాబట్టి బాధకు అనగా "నేను" అనబడే దాని (సారాంశాని)కి ప్రేమకు సంబంధ మేమిటి? ప్రేమకు, బాధకు, సంబంధం వుందా?"నేను" అనే దాన్ని ఆలోచన కల్పించింది. కాని ప్రేమకు తెచ్చి పెట్టిందా? (TWL-181)

## ప్రేమకు, ఆలోచనకు సంబంధం లేదు

ప్రేమ ఆలోచన వల్ల ఏర్పడిందా ? ఆలోచనంటే ప్రేమ, ఆలోచనవల్ల ఏర్పడకపోతే బాధకు, ప్రేమకు సంబంధం లేదు, కనుక ప్రేమ వల్ల జరిగే క్రియకు, బాధవల్ల జరిగే క్రియకు సంబంధము లేదు.

బాధవల్ల జరిగే క్రియ "నేను" అనే దాని క్రియే. కనుక నిరంతరం ఘర్షణ వుంటుంది. ఇందులో కారణం తెలుస్తూనే వుంది. కనుక బాధ పీడలేకుండా ప్రేమించడము సాధ్యమా? ఆలోచన ప్రేమ కాదు. ఆలోచన కరుణ కాదు. కరుణ అంటే తెలివి. అది ఆలోచన నుండి వచ్చేది కాదు. తెలివి యొక్క పని యేమి!

(TWL-182)

## ప్రేమ కానిది

ప్రేమ-దాని మొత్తం ఈర్ష్య, బంధం, పరాధీనం కాదు. కామం, దివ్యం అనే విభజనతో కూడింది కాదు. వ్యక్తిత్వం రావడానికి ప్రేమ ఒక అంగం.

(KNB - 29th Date)

## ప్రేమ కానివి

సరుకు మార్పిడి లేనప్పుడే చెయ్యగలవు· అయినా చెయ్యాలి· ఎందుకంటే ధనవంతుడుగా చావడమంటే వృథాగా జీవించినట్లే. అన్నిటి కన్నా మనసును, హృదయాన్ని పరిశుద్ధ పరచే జ్వాల ఒకటుండాలి, అది అన్నిటినీ నూతనంగా చేస్తుంది, ఆ జ్వాల మనసుకు సంబంధించింది కాదు. అభ్యాసము చేస్తే వచ్చేదికాదు. దయ చూపడము అనేదాన్ని ప్రకాశింప జేయవచ్చును. కాని అది జ్వాలకాదు. సేవా కార్యక్రమం ప్రేమ కాదు. అది అవసరము, లాభదాయకమైనా ప్రేమ కాదు.

అభ్యాసము ద్వారా క్రియ శిక్షణతో కూడిన సహనం కాని, చర్చిద్వారా, గుళ్ళద్వారా సాధన చేసిన కరుణగాని, మృదుల భాషణగాని, మెత్తటి విధానము గాని, రక్షకుని ఆరాధించడం గాని, విగ్రహ పూజగాని, ఆదర్శాన్ని కొలవడం గానీ, ఏదీ ప్రేమ కాదు. (CL I-152)

## ప్రేమ-పెండ్లి

నీవు చెప్పిందాన్ని బట్టి నీవు ఒంటరి తనపు భీతివల్ల, భౌతిక వాంఛల నిమిత్తం, అవసరాల నిమిత్తము వివాహం చేసికున్నావు. ఇదంతా ప్రేమ కాదని తెలిసికొన్నావు. మర్యాద కొరకు దాన్ని ప్రేమ అని పేరు పెట్టావు. కాని వాస్తవంగా "ప్రేమ" శబ్ద జాలంలో చేర్చావు. ఎక్కువ మందికి ఇదే ప్రేమ- ఆ ప్రేమ చుట్టూ గజిబిజి, మంచు ఉంటుంది; పవిత్రత లేదనే భయము, ఒంటరితనపు భయం, నిరుత్సాహపు భయం, వృద్ధాప్యపు, నిర్లక్ష్యపు భయం, అలా ఎన్నో భయాలు వుంటాయి. ఇదంతా ఆలోచనా ప్రక్రియ. అది ప్రేమ కాదని తెలుస్తూనే వుంది. మళ్ళీ కావాలనేది ఆలోచనే. మళ్ళీ మళ్ళీ అనేది సంబంధాన్ని నిర్వీర్యం చేస్తుంది,........ఆలోచన ఎప్పుడు నిర్వీర్యమే. గతమే, పాతదే........ఆలోచన ఎన్నటికి కొత్తదికాదు. నీవు గమనించినట్లు ప్రేమ ఆలోచన కాదు. ఆలోచనాపరుడు లేనప్పుడే ప్రేమ వుంటుంది. ఆలోచించేవాడు ఆలోచన నుండి వేరైనవాడు కాదు. రెండు ఒకటే. ఆలోచనా పరుడే ఆలోచన. (CL I-185)

## ప్రేమంటే సానుభూతి కాదు, సహాయం కూడా

ప్ర: బాధలో వున్న వాని పట్ల వుండవలసిన బాధ్యత యేమి ?

కృ: చూపవలసింది స్పందన, కరుణ, అంతే; ఇంకేమీ కాదు.

అలాంటి పరిస్థితుల్లో వాస్తవంగా ఏం చేయగలవు? హిందువైతే అతని నమ్మకాల చొప్పున, క్రైస్తవుడయితే క్రైస్తవ విశ్వాసము ప్రకారము లేకపోతే స్వానుభవం నుండి కల్గిన నిబద్ధతను బట్టి ఓదార్చుతారు. అతనికి కావలసింది, బాధ తొలగడం. కాని తప్పించుకొని పోయే మార్గాలా చూపవలసింది? కాదు. కరుణ నుండి ఏది పుడితే అదే సాయం చేసేది. (సారాంశం TWL-242)

బాధలోనున్న వారికి సరాసరి సహాయం చేయలేరు. కరుణ నుండి ఉద్భవించే శక్తి మాత్రమే సహాయ పడవచ్చు.

కరుణకు ఫలం వుందా? ఫలం వుంటే కారణం వుంటుంది! కరుణకు కారణం వుంటే, కరుణ గల వారుగా ఉండలేరు. (TWL-253)

కరుణ, లోలోపలి చైతన్య పొరల మీద ప్రభావం చూపుతుంది. (TWL-254)

## ప్రేమ-అనురాగం

యదార్థంగా మనకు చాలా తక్కువ తెలుసు! మనం ఎన్నో పుస్తకాలు చదివి వుండవచ్చు. కాని దేనిని గూర్చైనా ప్రత్యక్ష అనుభవం వున్నవాళ్ళు చాలా తక్కువ. ఎంతో ముఖ్యమైంది ఏమంటే వాస్తవం యొక్క, దైవం యొక్క ముఖాముఖి అనుభూతి! దానికి ప్రేమ వుండాలి. (LH-94)

నిజమైన అనురాగం కృత్రిమంగా రాదు. అది భావనకు రావాలి. మీ సంరక్షకులు, మీ తల్లిదండ్రులు, మీ ఉపాధ్యాయులు కూడ భావించాలి. ఎక్కువ మందికి నిజమైన అనురాగం లేదు. వాళ్ళు తాము సాధించిన వాటితోను, కోర్కెలతోను, జ్ఞానంతోను, విజయంతోను బాగా ముడిపడి పోయారు. వాళ్ళు చేసిందానికి, చేయవలసిందానికి ఎంతో మహా ప్రాధాన్యత ఇస్తారు. చివరికది వాళ్ళను నాశనం చేస్తుంది. (LH-95)

## ప్రేమ-సుఖం

కోరితే సుఖం రాదు. అది మంచితనం ఉన్నపుడు, ప్రేమ ఉన్నపుడు, కాంక్ష లేనపుడు, మనసు నెమ్మదిగా నిజమేమిటో గ్రహించాలన్నపుడు సౌఖ్యం లభిస్తుంది. (TMC-191)

## ప్రేమ-దుఃఖం

దుఃఖం ప్రేమలాగ విచిత్రమైంది. దుఃఖం ప్రేమను దూరంగా వుంచుతుంది. దుఃఖాన్ని పూర్తిగా పరిష్కరించ గలవు. కాని ప్రేమను ఆహ్వానించలేవు. దుఃఖమనేది స్వయం సానుభూతి, దానికి ఎన్నో ఆదుర్దాలు, భయాలు, దోషాలు తోడవుతాయి. వీటిని ఆలోచనలతో తొలగించలేవు. ఆలోచన, ఆలోచనాపరుని సృష్టిస్తుంది. ఆ ఇద్దరి మధ్య దుఃఖం పుడుతుంది. తెలిసిన దాన్నుండి స్వేచ్ఛ పొందడమే దుఃఖాన్ని అంతం చేయడము. (KNB 30th)

## ప్రేమ నిత్య నవీనం

ప్రేమ సంపూర్ణమైందని అన్నాము. అది ఎప్పుడూ క్రొత్తదే. అంటే పాత దానికి వ్యతిరేకమైందని భావన కాదు. ఆ భావన వుంటే మళ్ళీ అది పాతదే అవుతుంది. కోర్కె లేకుండా సెక్స్ వుందంటే అది పూర్తిగా విలువ లేనిది. ఆలోచనా

ప్రక్రియ మొత్తం తెలిసి వుంటే, ప్రేమించేది తటస్థిస్తుంది. ఎలాగైనాసరే ఆనందము పొందాలని పట్టుబడితే, ప్రేమంటూ వుండదు. (TOR-80)

ఆలోచన ప్రేమ కాదు; కాని ఆలోచన, ఆనందరూపంలో ప్రేమను చుట్టి వేస్తుంది. ఆ వలయంతో బాధను తెచ్చిపెడుతుంది. కాని దేంటో తెలిసికుంటే, ఉన్నది మిగుల్తుంది. ప్రేమ కానిదేదో తొలగిస్తే, అపుడు "నేను ఉన్నాను, నేను లేను"అనే భావనలు కూడ లేని ప్రేమ వుంటుంది. (TOR-110)

## శ్రద్ధయే ప్రేమ

ప్రేమంటే శ్రద్ధ. అదే కరుణ. ఆసక్తి, కరుణ తెలివిగా లేకుంటే, చాల పరిమిత భావంలో మనిషి చరిస్తాడు. అన్ని పనులు, పరిమిత మౌతాయి. కరుణ వున్నచోట ఆ క్రియ నిండుగా సంపూర్ణంగా, తిరగతోడనిదిగా వుంటుంది.

(TWL-153)

## భయం లేనప్పుడే ప్రేమ

నిజంగా నీవు దేన్ని గూర్చి భయపడక పోతే అపుడు నిన్ను నీవు కనుగొన గలవు. ఉదయం లేచినపుడో, ఒంటరిగా నడిచేటప్పుడో హఠాత్తుగా వింతైనది సంభవిస్తుంది. అది ఆహ్వానించనిది, ప్రాధేయపడనిది, ఎదురుచూడనిది. దాన్ని ప్రేమనో, సత్యమనో, సుఖమనో, పిలవవచ్చు. (TMC-34)

## ద్వేషం లేనప్పుడు ప్రేమ

ప్రేమ తేలికగా లభించేది కాదు. ద్వేషించడం తేలిక. ద్వేషం ఒక ఫ్యాషన్‌లా మనుష్యుల్ని దగ్గరకు చేరుస్తుంది........కాని ప్రేమ చాల కష్టమైంది. ప్రేమించడం నేర్చుకోలేవు. అయితే నీవు చేయగలిగిందేమంటే ద్వేషాన్ని హరించి, నెమ్మదిగా దాన్ని ప్రక్కకు నెట్టడం........ద్వేషం తొలగితే, ఉదాసీనత వహించితే మనసులో స్పందన కలుగుతుంది, సెంటిమెంటు వుండదు. అపుడు ప్రేమను తెలిసి కోగలవు. (TMC-62)

## ప్రేమ-అభ్యాసం

ప్రేమను సాధన చేసేవాడు ప్రేమించలేడు, ప్రేమించి, ప్రేమతో కళవళ పడకుంటే (ప్రేమ జోలికి పోకుండా వుంటే) అపుడు ప్రేమ పని చేస్తుంది.

(TMC-156)

## ప్రేమ–ప్రతిఫలం

ఇతరుడు నన్ను ప్రేమిస్తున్నాడు, నేనతనిని ప్రేమిస్తున్నానంటే అది ప్రేమ కాదు. ప్రతిఫలం కోరకుండా అసాధారణమైన అనురాగ భావన వుండడమే ప్రేమించడం. నీవు చాలా తెలివిగా ఉండవచ్చు, అన్ని పరీక్షలు పాసయి ఉండవచ్చు, డాక్టరేటు సంపాదించవచ్చు, ఉన్నత స్థానం పొందవచ్చు, కాని నీకు ఈ స్పందన, సాధారణ ప్రేమ భావన లేకపోతే నీ హృదయం శూన్యంగా ఉంటుంది. ఇక జీవితాంతం బాధతో ఉంటావు. (TMC-168)

## ప్రేమ–సెక్సు

ప్రేమ ఉన్నపుడు లైంగిక క్రియ ఒక సమస్య కాదు. ప్రేమ లేమియే లైంగిక సమస్యను సృష్టిస్తుంది. (ESL)

## ప్రేమ ఉండేస్థితి

తృప్తికి, భద్రతకు మరొకరిని వాడుకోవడం ప్రేమ కాదు. ప్రేమంటే భద్రత కాదు. భద్రత యెడ కోర్కె లేనపుడు ఉండే స్థితి ప్రేమ. అది సున్నితమైన స్థితి. ఆ స్థితిలో మాత్రమే వేర్పాటు ధోరణి, విరోధం, ద్వేషం, ఉండడం అసాధ్యం. ఆ స్థితిలో కుటుంబం ఏర్పడవచ్చు. అయితే అది వేర్పాటుతనము కాదు, స్వార్థంతో చుట్టుకొన్నది కాదు.

తన ఆలోచనా ధోరణి తెలియడం మంచిది. భద్రత గూర్చి లోపల వుండే కాంక్ష వేర్పాటుతనం ద్వారా, హింస ద్వారా బహిర్గతమౌతుంటుంది. ఈ ప్రక్రియ పూర్తిగా అర్థం గాకపోతే ప్రేమ అనేది ఉండదు, ప్రేమ భద్రతకు మరో శరణ్యం కాదు. ప్రేమ వత్తిడి వల్ల వచ్చేది కాదు. ఏ స్థాయిలో, ఏ రూపంలో వత్తిడి ఉన్నా అది కేవలం ప్రేమను కాదనడమే.

ప్రేమంటే ఆదర్శంతో కూడిన విప్లవవాది విప్లవం కాదు. అతడు భద్రతకు బదులుగా, మరోరకమైన దాన్ని చూపిస్తాడు. ఆశ కల్పిస్తాడు. అదే మరణం.

ప్రేమ మాత్రమే తీవ్రమైన విప్లవాన్ని తీసికొని రాగలదు. సంబంధంలో పరిణామాన్ని తేగలదు. ప్రేమ మనసుకు సంబంధించింది కాదు.

ఆలోచన ఆశకు రూపకల్పన చేయగలదు, అద్భుతమైన నిర్మాణం చేయగలదు. కాని ఆలోచనే ఇంకా గందరగోళానికి, ఘర్షణకు, దుఃఖానికి దారి తీస్తుంది.

ఉపాయంతో కూడినట్టి, స్వార్థంతో చుట్టేసుకున్నట్టి మనసు లేనపుడే ప్రేమ ఉంటుంది. (CL II-112)

## ప్రేమ - సమగ్రం

ప్రేమ వస్తువు నిమిత్తం ఏర్పడలేదు. కనుక ప్రతిదీ గజిబిజిగా ఉంటున్నది: సంబంధాలు భయంకరంగా తయారవుతున్నాయి. మన లేమిని, ఒంటరితనాన్ని, చాలనితనాన్ని కప్పివేయడానికి సంబంధం ఒక మార్గమైంది. అసూయ, ద్వేషాన్ని తెచ్చిపెడుతుంది: ఎందుకంటే ప్రేమ లేదు. ప్రేమకు ఉద్దేశముండదు. ప్రతి చలనం అందులో ప్రవేశిస్తుంది.

ప్రేమకు సమగ్రత కావాలి కాని అభిప్రాయాలకు, నమ్మకాలకు కట్టుబడి పోవటం కాదు. స్వయం విమర్శనా జాగృతి కలిగి వుండడమే సమగ్రత. అది క్షణం నుంచి క్షణానికి ఉండే జాగృతి. (9th day KNB)

## ప్రేమ ఎప్పుడుంటుంది?

పదే పదే అదే ప్రశ్న. నీవు చేయవలసినది ముఖ్యం కాదు. నీవు ఏం చేస్తున్నావో చూడడం ముఖ్యం. భావి చర్యతో నిమగ్నమై పోతున్నావు. అది వెంటనే చేయవలసిన పని నుండి తప్పుకోడానికి ఒక మార్గం చేయడానికి ఇష్టపడవు. కాని ఏం చేయాలి అని అడుగుతూనే ఉంటావు. అంటే మళ్ళీ యుక్తిగా ఉంటావు. నిన్ను నీవు మోసం చేసుకుంటావు. అందుకే నీ హృదయాన్ని మనసుకు సంబంధించిన వాటితో నింపుతూ ఉంటావు. కాని ప్రేమ మనసుకు సంబంధించింది కాదు. నీ హృదయాన్ని ఖాళీగా ఉండనిమ్ము. మాటలతో నింపొద్దు. మనసుకు సంబంధించిన క్రియలతో నింపొద్దు. పూర్తిగా ఖాళీగా ఉంచు. అప్పుడే అది (ప్రేమతో) నింపబడుతుంది. (CL I-152)

## ప్రేమ ఎక్కడ ఉంటుంది?

ఉన్న దాన్ని ప్రేమించడమే విజ్ఞానానికి మొదలు (CL I-163)

ప్రతి దానికి మొదట, చివర ఉంటాయి: అది తిరిగిపోతుంది, అరిగిపోతుంది. మనసుకు సంబంధించిన విషయాలు లేకుండ హృదయం ఖాళీగా వుంటే, ఆలోచన లేకుండ మనసు ఖాళీగా వుంటే అపుడు ప్రేమ ఉంటుంది. ఖాళీగా ఉండేది ఖర్చు కానిదే. (CL 1-166)

ప్రేమ అలా ఉంటుంది; అందులో కాలం లేదు, దేశం లేదు, తాదాత్మ్యం (IDENTITY) లేదు. తాదాత్మ్యమే సంతోషాన్ని, బాధను కలుగజేస్తుంది. తాదాత్మ్యమే ద్వేషాన్ని, యుద్ధాన్ని తెచ్చిపెడుతుంది. అది మనుష్యుల చుట్టు, ప్రతివాని చుట్టు, ప్రతి కుటుంబం చుట్టు, ప్రతి జాతి చుట్టు గోడ కడుతుంది. మనిషి గోడ మీదగా అవతల మనిషిని చేరతాడు, కాని అతడు కూడ వలయంలో చిక్కుకొని వుంటాడు. నీతి అనేపదం ఇద్దరినీ కలిపే వంతెన. అందుకే అది కూడ అసహ్యంగా, నిరుపయోగంగా వుంటుంది.

## ప్రేమ – ఎలా తెలుస్తుందీ

ప్రేమంటే ఉద్రేకం కాదు. అది పొగలేని జ్వాల. ఆలోచనాపరుడుగా నీవు లేనప్పుడు ప్రేమంటే ఏమిటో నీకు తెలుస్తుంది. ప్రేమ నిమిత్తం నిన్ను నీవు, ఆలోచనా పరుణ్ని వదులుకో లేవు. ఎందుచేతనంటే ప్రేమ మనసుకు సంబంధించింది కాదు. కనుక క్రమ శిక్షణగాని, ప్రేమించాలనే సంకల్పం. కాని ప్రేమను గూర్చిన ఆలోచనా ఉద్రేకం. ప్రేమ మనసును అధిగమించింది కనుక ఆలోచన ప్రేమను గూర్చి చింతించ లేదు. ఆలోచన కొనసాగేది; ప్రేమ తరిగి పోయేదీ కాదు. తరగందీ ఎప్పుడు కొత్తదే. జరిగే దాంట్లో అంతం అవుతుందనే భయం వుంది. అంతం అయ్యేది ప్రేమ యొక్క శాశ్వత ఆరంభాన్ని తెలిసి కుంటుంది.

(CLI-185)

## ప్రేమ నెలా కనుగొనటం

ఈ సమస్యలోకి తార్కికంగా, హేతు బద్ధంగా తెలివిగా ప్రవేశించ వలసిన అవసరమున్నా వాటిని అధిగమించి వెళ్ళవలసిన అవసరముంది. ఎందు చేతనంటే తర్కం ప్రేమ కాదు, హేతువు ప్రేమ కాదు. ప్రేమించాలి, ప్రేమించబడాలి అనేదీ ప్రేమకాదు. ఇదికూడా నిషేధాత్మక మార్గంగానే ఉంది "అజ్ఞ" మార్గంలా జీవిత గమనంలో క్షణక్షణం ప్రేమ కాని దాన్ని కాదంటూ, ప్రక్కకు కట్టివేస్తూ వుంటే ప్రేమైన దేదో ప్రభవిస్తుంది.

(TWL-162)

## ప్రేమ లేని జీవితం శూన్యం

ప్రేమ లేని జీవితం లోతు లేని గుంట లాంటిది. లోతైన నదిలో జీవజల సంపద వుంది. ఎన్నో చేపలు బ్రతుకుతాయి. కాని లోతులేని గుంటలో నీళ్ళు తీవ్ర సూర్య తాపానికి ఆవిరై పోతాయి. ఇక అందులో బురద, మురికి తప్ప మరేం వుండదు. (LH-91)

## ప్రజ్ఞకు ప్రేమ తోడవ్వాలి

ప్రేమ, ప్రజ్ఞ వున్నపుడు మాత్రమే అందరికి భద్రత కల్గుతుంది. ఎవరికైనా బాహ్యమైన భద్రత అసాధ్యంగా వుంది. ఎందుచేతనంటే మనం ఘర్షణ, క్లేశముతో కూడిన ప్రపంచాన్ని సృష్టించాము. అలాంటి పరిస్థితుల్లో మన విద్యా విధానం-పూర్వంది కాని ప్రస్తుతాంది కాని-నిరుపయోగంగా గోచరిస్తుంది కాదా?

సాంప్రదాయక ఆలోచనలనుండి దూరమై పోవడం తల్లిదండ్రుల, ఉపాధ్యాయుల తక్షణ బాధ్యత. కేవలం నిపుణుల (Experts) మీద, వాళ్ళ అన్వేషణల మీద ఆధారపడడం జరగరాదు. (ESL)

## పిల్లల్ని ప్రేమిస్తున్నామా?

మన పిల్లల్ని మనం ప్రేమిస్తున్నామని ఎంతో తేలిగ్గా అంటాము. అయితే నేటి సామాజిక పరిస్థితులను అంగీకరించే, మన హృదయాల్లో ప్రేమ వుంటుందా? నేటి వినాశకర సమాజంలో మౌలిక పరిణామం తేలేకపోతే మనలో ప్రేమ వుంటుందా? మన పిల్లలకు ప్రత్యేక నిపుణులు చదువు చెపుతారని ఎదురు చూచినంత కాలం ఈ గందరగోళం దుఃఖం సాగుతూనే వుంటుంది. ఎందుకంటే ప్రత్యేక నిపుణులు ఏదో భాగంతో సంబంధం పెట్టుకుంటారే గాని, మొత్తంతో సంబంధం పెట్టుకోరు. వాళ్ళకు వాళ్ళే అసమగ్రంగా వుంటారు. (ESL)

## ప్రేమ ఎక్కడ ఉంది

బంధం, వ్యక్తిగత లైంగికసంతోషం మొదలగునవి లేకుండ అసలు ప్రేమ అంటూవుందా? ఈ దేశంలో ప్రేమవుందా? బయట జరిగే కార్యకలాపం లేకుండ ప్రేమ - కరుణ లోతుగా వుందా? ఇతర మానవులను చంపేటువంటి, యుద్ధ సామాగ్రిని ప్రయోగుచేసేటు వంటి ప్రభుత్వాన్ని ప్రేమిస్తారా? ఇదంతా మనం యోచిస్తామా లేక ఎవరికి ఏం జరుగుతుందో మన లెక్కలో లేదా? నీ భార్యను, నీ భర్తను, నీ ప్రక్క వాడిని, ఎలా మన్నిస్తావు? (స్వయంగా విన్నది. 30-12-82)

—0—

# ఈ రచనకు ఉపయోగించిన గ్రంథాదులు


COL I / CL. I — Commentaries on Living, From the Note Books of Jiddu Krishnamurti, 1956. KWINC.

COL II / C.L II — Commentaries on Living, Second Series by Jiddu Krishnamurti, 1956. KWINC.

C.L III / COL III — Commentaries on Living, Third Series by Jiddu Krishnamurti 1960. KWINC.

T.R. / TOR — Tradition and Revolution : Dialogues by Jiddu Krishnamurti.

TMC. / TMOC — This Matter of Culture by Jiddu Krishnamurti 1964 to 1974. KWINC.

TWL / WL — The Wholeness of Life : Dialogues between Jiddu Krishnamurti and others. 1978. KFT (L)

KNB - Krishnamurti's Note Book 1976.

LA - Life Ahead - by Jiddu Krishnamurti 1963. KWINC.

ESL / ESOL — Education and the Significance of Life by Jiddu Krishnamurti 1953: KWINC

FLF - The First and the Last freedom by J.K. 1954.

BV - Beyond Violence by Jiddu Krishnamurti 1973 KFT (L)

TAI / AI / TAOI : The Awakening of intelligence : Discussions by Jiddu Krishnamurti. 1973. KFT (L)

QA - Questions and Answers, Madras : 30.12.82 Direct Notes.

B.L / BOL — The Book of Life by J. Krishnamurti.

AD - A Dialogue With Students at Rishivalley – 16th December 1983.


— * —